# అంకితం

*

''నా ఒక్కడే ఒక్క తమ్ముడు రామభద్రయ్య చనిపోయేడు. జీవితంలో మళ్ళీ యింక కోలుకోలేని నష్టం భగవంతుడు నాకు కల్పించినాడు. ''మిత్రమా, నీ కావ్యాన్ని నా తమ్మునికి, ఎన్నటికీ మరచిపోలేని నా తమ్మునికి, అంకితం చేసి మరలమరల నా తమ్ముణ్ణి నాకు జ్ఞాపకం చెయ్యి.''

ఏ సముద్రపుఅగాధంలోనోపడి, కొట్టుకుపోతున్న వ్యక్తిలా తన తమ్మునిమాటలు చెప్తూ కన్నుల్లో కన్నీరు నింపుకొన్నాడు నా మిత్రుడు గురునాథం.

రామభద్రయ్యా! నీకు నాయనా యీ నా కావ్యం అంకితం! పిలిస్తే నవ్వుతూ పలికేవాడివి. నీ అన్నకు కుడి భుజంగా వుండేవాడివి. నీవు జ్ఞప్తికొచ్చినప్పుడల్లా మీ అన్న కుమిలిపోతూనే వున్నాడు. అంతకన్నా, యింతకన్నా యింక మేమేం చేస్తాం!

అందుకో రామభద్రయ్యా! యీనా కావ్యాన్ని! ఇది నీకు అంకితంలే! ఇంతకన్నా యింక మేమేమీ చేయలేములే!!

ఆకుల సుబ్రహ్మణ్యం



కృతిభర్త: స్వర్గీయ పత్తి రామభద్రయ్య

ననం : 19—6—1936 మరణం : 14—12-

# నా మాట

చరిత్రకు సబంధించిన నాటకాలను వ్రాసేటప్పుడు నాటకకర్తను అనేకసమస్యలు పట్టుకొని ఎదురు నిల్చొంటవి; అందులో ప్రత్యేకించి నిన్నా మొన్నా జరిగిన చారిత్రక సంఘటనలను గురించి మరీ అనుకొంటాను. శ్రవ్యనాటకాలన్నా, దృశ్యనాటకాలను వ్రాసేటప్పుడు మరో కొన్ని నూతనచిక్కులు అదే నాటకకర్తను పట్టుకొని మరియొక ప్రక్క వేధిస్తుంటవి. ఈ చిక్కులకు సమస్యలకు జవాబులు చెప్పుకొంటూ నాటకకర్త అసిధారావ్రతంలా నాటకాన్ని నడిపించాలి. అప్పుడే ఆ నాటకం ప్రజల మన్ననలబొంది, పదికాలాలపాటు బ్రతుకుతుంది. ఈ విధంగా నడక సాగించాలంటే రచయితకు చాలా వ్యవధి కావాలి. అంతేగాని ఏదో పురవడిలో కళ్ళుమూసుకొని ఒక్కొక్క నెలకు ఒక్కొక్క అభినయం వ్రాసి పడవేసే రచయితలకు యిది సాధ్యంకాదు. వారిమాట అటుంచండి.

యీ అల్లూరి సీతారామరాజుగారి జీవితచరిత్రను అన్ని కోణాల్లో నుంచి పరిశీలించి ఒక్క సంవత్సరం క్రితం ఏకాంకిక వ్రాసేను. ఆనాడు ఆనాటికా రచనకు నాకు స్ఫూర్తినిచ్చిన మహనీయులు యిద్దరే యిద్దరు. ఒకరు అనంతపురంజిల్లా నివాసి శ్రీయుత కొత్త రామకృష్ణప్పగారు. రెండవవారు మా మండలీయులైన శ్రీయుత యన్. వి. సుబ్బారావుగారు. వీరుభయులూ నాకు నిత్య ప్రభాతస్మరణీయులు.

ఆ నాటికను తెలుగు నాటకరంగం యీ పన్నెండుమాసము లతి స్వల్పకాల వ్యవధిలోనే తన అంకమున కొన్నివందల పర్యాయములు ఆడించుకొన్నదంటే, అది రచయితగా నేను గర్వించదగ్గ విషయం. ఇంత ప్రోత్సాహాన్నిచ్చిన తెలుగు కళాకారులకు యివే హృదయపూర్వక నమస్కృతులు.

తెలుగు కళాకారులు నా కిచ్చిన ప్రోత్సాహబలంతో యీ నాటకాన్ని వెలారించేను. ఈ దృశ్యకావ్యాన్నిగూడా ఆ కళామూర్తుల ముందే వుంచుతున్నాను. తూచి తూకం కట్టాల్సింది వారే!

ఆఖరులో నా మిత్రునిమాట వ్రాస్తున్నాను. తుదిలో వ్రాసినా తొలుతనే, యీ మిత్రునికి నమస్కారంచేసి యీ "నామాట" మొదలు బెట్టేను. సిటి పబ్లిషింగ్ హౌస్ ప్రచురణకర్తలు, విక్టరీప్రెస్ అధినేతలు, చిరకాల నా మిత్రుడు, శ్రీయుత గురునాథంగారు యీ పుస్తకాన్ని వెలుగుకు తెచ్చినందుకు, యీనా మిత్రుని ప్రేమతో నమస్కరిస్తూ హృదయపూర్వకముగా అభినందిస్తున్నాను. ముచ్చటగా ముద్రించి పుస్తకమును సర్వాంగ సుందరంగా తీసుకొనివచ్చిన విక్టరీప్రెస్ కార్మికులకు నమస్కరించకుండా "నామాట"కు విరామచిహ్నం అతికించను.

13-2-1960
నెల్లూరు

మీ
ఆకుల సుబ్రహ్మణ్యం.

# పీఠిక

రెండురంగముల యితివృత్తముతో భాసించుచు "అల్లూరి సీతారామరాజు" నాఁ బరగిన యీ నాటకరాజమును సంతరించిన శ్రీ ఆపల సుబ్రహ్మణ్యకవిగారు నాకుఁ జిరకాల పరిచితులు. వీరీ రూపకములోఁ బాత్రోచితభాషను బ్రవేశపెట్టి నిష్కృష్టముగా దృశ్య లక్షణముల నెఱిఁగి రచనను సాగించియున్నారు. చారిత్రాత్మకము వీర రస ప్రతిపాదకమునైన వృత్తమే యీ రూపకములోని యితివృత్తము. ప్రకృత మీ కవిపుంగవుఁడు పరమప్రయోజన సాధనము, ప్రకృష్టము నగు నీ నాటకమును రచించి యాంధ్రరసికలోకమునకు సమర్పించుకొన్నారు. సాహిత్యములో రూపకమున కున్నతస్థానమున్నది. మన ప్రాచీన విద్యార్థి తొలుత శబ్దములవల్లించి, అమరాదినిఘంటువులఁ బుక్కిటఁబట్టి, కావ్యములఁ జదివిన పిమ్మటఁగాని రూపకమును జేపట్టకుండెడివాఁడు. అందుచేతనే "నాటకాన్తం హి సాహిత్యమ్" అనునూక్తి వచ్చినది. ఆది కారణముగా సాహిత్య సృష్టిలోను, సాహిత్యాస్వాదనలోను దృశ్య కావ్యముత్కృష్టతమై వెలుఁగొందినది.

రూపకకర్త తాను సృష్టించిన పాత్రలలోఁ దాదాత్మ్యముపొంది రచనను సాగింపవలసియుండును. ఇతివృత్తము సంఘర్షణముతోఁగూడి తత్పరిష్కారముతో ముగియవలయును. ఆఖ్యానమువలెఁ గాక రూపక కారుఁడు కథను కుదించుకొనవలసియుండును. కథాకథనము సంభాషణ ద్వారా జరిపింపవలయును. కథౌచిత్యము. పాత్రౌచిత్యము. రసౌచిత్యము చక్కఁగాఁ బాటింపఁబడవలయును. ఇన్ని లక్షణములు పొసఁగినను దృశ్యముగాన నిరుప్రక్కలి పదునుగలిగినదై దృశ్యశ్రవ్య గౌరవముల రెండింటి నందకపోయినచోఁ బ్రయోజనముండదు. మీఁదు మిక్కిలి రూపకకర్త మందిమనస్తత్త్వ మెఱిఁగియుండు టత్యంతావశ్యకము. ఇట్టి కట్టుదిట్టములుండుటచేతనే రూపకనిర్మాణము కష్ట సాధ్యమైనది. కావుననే సాహిత్యములో నాటకమున కున్నతస్థానము లభించినది.

శ్రీ సుబ్రహ్మణ్యము గారింతవరకు గేయములతో మాత్రమే విఖ్యాతి నందుకొనుచునుండి యిప్పుడు నాటకకర్తలలో స్థానమేర్పఱచుకొనినాఁడు. దేశభక్తి ప్రతిపాదకమైన యీ నాటక భేదమీ కవిగారేఁఖ్యాని చేతిలోఁ గీలుబొమ్మయైనది. ఆధునిక కవులకు దేశభక్తి, దేశాభిమానములు శూన్యములు. వారి కావ్యములలో దేశ ప్రబోధకములగు సన్నివేశములు శశవిషాణాన్వేషణములు. ఇఁక చరిత్రాత్మకములైన రచనల విషయము చెప్పనక్కఱలేదు. వేల సంఖ్యనుమించు తెలుఁగు కవులలో దేశమును స్మరించువారసలే లేరు. నేఁటి భావకవులీ గొడవను బట్టించుకొనరు. మన నాటకకర్త యట్టి కొఱతను దీర్చుటకై "అల్లూరి సీతారామరాజు" పేరుతో నీ దృశ్య కావ్యమును వ్రాసి ఆంధ్రదేశమునకు ఆంధ్ర సారస్వతమునకుఁ బ్రీతిపాత్రుఁడైనాఁడు. ఇదియొక అపురూపమైన నాటకరాజము. అస్వతంత్ర జాతికొక స్మృతిగ్రంథము. స్వాతంత్ర్యమునకు బారిశోషికము. గాంధీమహాత్మునిది కత్తిలేని సాత్త్వికపుపోరు. సీతారామరాజుది కత్తిగల సాత్త్వికపు పోరు. భారతజాతీయ ధర్మము పరులకు లొంగకూడదని ఋజువు చేయుటకే పాశ్చాత్యులపై ప్రజలనుగూడ కట్టుకొని సీతారామరాజుద్యమమును నడపినాఁడు. ఆ యుద్యమములో శ్రీ రాజుగారి శౌర్యాగ్నిరాజి, మండి, యత్యుగ్రమై పాశ్చాత్యులను దగ్ధమొనర్చినది. ఆ శౌర్యము, ఆ ప్రతిఘటనలు, ఆ వ్యూహములు, ఆ ప్రతిజ్ఞలు అన్నియు నిటఁ బొందుపఱచినచో వ్యాసము గ్రంథవిన్యాసమునకు మించిపోవును. ఈ ఘట్టములనన్నింటిని తిక్కనయుద్ధ పంచకములోఁ బోల్పవచ్చును.

సీతారామరాజు ప్రకృతి యొసంగుబిడ్డ. భోగ విముఖుఁడైన నాయకుఁడు. కొండలలో దాగి, పొంచుచు, పైఁబడుచు, చీల్చుచు, కలచుచు, విటతాటనము చేయుచు, తృటిలోఁ జాటగుచు పాశ్చాత్యులను ముప్పుతిప్పలు పెట్టి మూఁడు చెరువుల నీళ్లు త్రాగించినాఁడు. ఆ తెల్లవారితో "గెరిల్లా వార్ ఫేర్" సాగించినాఁడు. ఈ ఘట్టములతో వీరరస ప్రవాహము పాయలుగట్టినది. ఈ రసప్రవాహము వెంటబడి నేనుగూడ విమర్శించుచునే యుంటిని. వేరొక గతిలేదు. కాని ప్రవాహము నడుమను, తీరము వెంటను, నంగుళమంగుళమును గల తామరపూలు

కలువపూలు మొదలైన శోభలు పాఠకులే చూచుకొనుచు నానందింతురు గాతమని నా మనవి. ఇందలి గేయములన్నియు సర్వసర్వంసహాజన శ్రేయములు.

ఈ నాటకమునందలి పాత్రపోషణము సర్వంకషకళాకుశలుని నిరవశిష్టపరిశీలనాశక్తి గోచరింపఁజేయుచున్నది. ప్రతి పాత్రలోఁ గూడ ప్రకృతి ప్రతిఫలించుచున్నది. ఈ నాటకములో నాయకుఁడుగా నభివర్ణింపఁబడిన సీతారామరాజు ధీరోద్ధతుఁడు. నిర్వక్రపరాక్రమశాలి. నిత్యసత్యనిరతుఁడు. ఆర్షధర్మప్రవర్తకుఁడు. ఇతనియందు గాంభీర్యము, స్థైర్యము, ఔదార్యము మొదలుగాఁగల యుత్తమనాయక గుణములన్నియు మూర్తీభవించియున్నవి. ఈ నాటకకర్తచే నీ నాయకుఁ డరిజనభయంకరుఁడుగను సమయము వచ్చినప్పుడు సమరాంగణమున దుమికి బాహుబల ప్రదర్శనమొనర్పగల యోధానయోధుఁడుగను దీర్చి దిద్దఁబడినాఁడు. నిజముగా సీతారామరాజు రామరాజే. స్త్రీ పాత్రములలో గంగమ్మ గాంభీర్యమున, పాతివ్రత్యమున నిజముగా గంగమ్మయే. ఆమె మాటలు వినుచున్నప్పుడు గంగమ్మలోను రామరాజులోను నెవ్వరు వీరరసము నెక్కువగాఁ బంచుకొనిరా యని ప్రతి సహృదయునకు శంక గలుగక మానదు. ఆమె సాక్షాన్మహిషాసురమర్దని. ప్రత్యక్ష రణదుర్గ. ఆమె హృదయకుహరమున దేశభక్తి దాగియుండి నృత్యము చేసినది. ఆమె దేశభక్తికిచ్చిన ప్రాధాన్యము భర్తృవియోగమునకు, పుత్ర మరణమునకుఁ గూడనియ్యలేకపోయినదని నతిశయోక్తి కానేరదు. మిగిలిన పాత్రలన్నియు సందర్భానుసారముగాఁ బరిపోషింపఁ బడినవి.

అందదుకులు తోదుకులు లేక నాటకకర్త సర్వత్ర సమాంతర రచన సాగించినాఁడు. ఈ నాటకమును జదివినచో దేశద్రోహియైనను దేశభక్తుఁడు గాఁగలఁడని నా విశ్వాసము. దీనిని చదువునప్పుడు మూఁడుకాళ్ళ ముదుసలికూడఁ బ్రళయకాల భైరవ ప్రతాపోజ్జృంభితుఁడు గాకపోఁడు. ముఖ్యముగా శ్రీ సుబ్రహ్మణ్యకవి తానే సీతారామరాజై యీ దృశ్యకావ్యపు తెరమరుగున దాగియున్నాఁడు. నాటకములోని కీలక మనఁగా నేమో యెఱిగిన సహృదయులకీ కవిపుంగవుఁడు ప్రత్యక్షము గాఁగలడు. ఈ నవయుగమున నిజముగాఁ బ్రత్యక్ష

సీతారామరాజు మనకు గవిగారే. కవిగారి చరిత్రమే సీతారామరాజు చరిత్రము.

ఈ దృశ్యకావ్యము నింత నిర్దుష్టముగా నచ్చువేసిన నా ప్రియ మిత్రుఁడు శ్రీ పి. గురునాథముగారిని, కృతికర్తను నేను హృదయ పూర్వకముగా నాశీర్వదించుచున్నాను. నా శిష్యుఁడు కీర్తిశేషుఁడు నైన పి. రామభద్రయ్య యీ నాటకమునకు గృతికర్త. స్వర్లోకమున విహరించుచున్న యాతని యాత్మకు శాంతి గలుగుగాతమని భగవంతుని ప్రార్థించుచున్నాను. శ్రీ సుబ్రహ్మణ్యము గారింకను నిట్టి నాటకముల నవిరళముగా వ్రాసి ఆంధ్ర సారస్వతమునకు సేవ చేయుదురని వేఁడుకొను చున్నాను. ఇఁక సెలవు. నమస్తే!

నెల్లూరు
29—1—1960

బడి. గురవారెడ్డి
ఆంధ్రభాషోపన్యాసకుఁడు
వేంకటగిరిరాజ కళాశాల, నెల్లూరు.

---

మిత్రులు!

సహజకవి, విద్వాన్ శ్రీ బడి గురవారెడ్డిగార్కి హృదయపూర్వక నమస్కారములు!

అడిగినదే తడవుగా అంతరాయముచూపక, భావగర్భిత భూమిక నెలారించి, నా చిన్ని పుస్తకమునకు మేలిపసిడితొడుగు తొడిగి, నాపై అక్షతలుచల్లి నన్నాశీర్వదించిన మీ కరుణామయ హృదయానికి యివే నా నమస్కృతులు!

రచయిత

# ఒక్క మాట

★ ★ ★ ★ ★ ★

లోకావధుల్ని దాటి ఆకాశంలోని మబ్బు తెరల్లో, అల్లనల్లన వీచే పిల్లవాయువుల్లో ఇంకా పైకిపోతే చంద్రమండలాల్లో కవి ఎంత రెక్కలు గట్టుకొని విహరించినా, ప్రాపంచిక సుఖదుఃఖాల 'పరిధుల్ని' దాటిపోలేడు. మానవ స్వాతంత్ర్యవాంఛావాహినులకు ఆనకట్టలు కట్టి ఆ ప్రవాహాన్ని 'రిజర్వాయర్' చెయ్యాలని ప్రయత్నించే దుష్టశక్తుల్ని క్షమించలేడు. అందుకే అతడప్పుడప్పుడూ ఆ ఆకాశపథాల్లోనుంచి కిందికి దిగివచ్చి యీ దుర్మార్గుల్ని చూచి 'హుం' అని హుంకరించి, దబాయించి, శాసిస్తూ ఉంటాడు. అవసరమైతే నిద్రాణమైన జాతులముఖాన నీళ్ళుచల్లి, నిద్రలేపి, కత్తిచ్చి కదనరంగానికి తోలి, వికటాట్టహాసంతో విజయధ్వజాన్నెత్తించి మురిసిపోతాడు. అంతవరకూ తాను కల్లం దింపనున్న జాతిని కత్తి దించనివ్వడు. శృంగారరసాన్ని సీసాబుడ్డిలో పూర వేయగలిగిన అతని కలం కోటానకోట్ల వీరులచేత రణనినాదం కూడా చెయ్యించి రక్తాలు పారించగలదు. "He is all-round and almighty; He can do and undo. He knows how to love good and how to punish the wicked—" అన్నాడు ఆ వెంపో. నిజ, నిజం. భారతీయకవి ఆంగ్లేయుల దుర్మార్గాలను ఎలా సహించగలడు? అందునా తెనుగుకవి అల్లూరి సీతారామరాజునెలా మరువగలడు?

ఆ మహత్తరవ్యక్తి జీవితాన్ని చక్కగా అడుగడుగునా, పద పదానా ఆవేశం పుట్టిపడేలా నాటకరంగానికి తీసుకురాగలిగిన అవకాశం-కాదు-అదృష్టం శ్రీ ఆకుల సుబ్రహ్మణ్యం గారికి కలిగింది. ఈయన

ఇదివరకే తెనుగు దేశానికి సుపరిచితుడు. ఒకప్పుడు యీ అభ్యుదయ కవిని దేశానికి పరిచయం చేసే అదృష్టం నాకే కలిగింది.

ఆవేశంతో, ఆదర్శంతో, ఆ, వేగంతో సంభాషణలను మిలటరీ మార్చిలాగా పరవళ్లు తొక్కించగల శక్తి 'ఆకుల' కలానికి వెన్నతో పెట్టిన విద్య. ఆయన తీసుకొనే కథావస్తువులుగూడా అలాగేవుంటయ్. మనిషిలోవున్న 'ముక్తసరి' తనానికి అనుగుణంగానే ఆయన సంభాషణలుగూడా అక్కడక్కడా ముక్తసరిగా వుంటయ్. ఆవేశం చిందించే పట్టున ఆ కలం మరి ఆగదు. ప్రతి చిన్నమాటలోనూ ఒక Image వుంటుంది. ఇది నాటకరచనకు అత్యవసరం. అదిలేని మాటలన్నీ రసస్ఫూర్తి కలిగించలేక, వ్యర్థమై, పైపెచ్చు Total efect ను పాడు చేస్తయ్. అలాకాకుండా, తూచినట్టుగా, భావగర్భితంగా, వాడిమాటలు వాడి రసపోషణ చేయగలశక్తి, ఆశక్తివల్లకలిగే రక్తి అక్కడక్కడా యీయన రచనల్లో మనకు బాగా కనిపిస్తుంది. ఇది 'ఆకుల' లో ప్రత్యేకత. కవికీగుణం అత్యవసరం. లేకపోతే రచన అనేది కూరగాయల లిస్టులాగా నిస్సారంగావుంటుంది. 'ఆకుల' వ్యక్తిగతంగా మెత్తనివాడు. కానీ మాట అడుగున under current లాగా వేడివేడి భావోద్వేగం కనిపిస్తుంది. ఆ వేడిలోనివాడే యీయన రచనల్లో అక్కడక్కడా మనకు వేడివేడిగా తగుల్తుంది. కోపాన్నిగాని, తాపాన్నిగాన్ని యీయన దాచుకోలేడు. కోపంవస్తే ముఖాముఖీగా అడిగేస్తాడు. తాపం కలిగితే ప్రత్యక్షంగా కన్నీరు కారుస్తాడు. ఈయన రచనల్లో యీ ప్రత్యేకతలు మనం చూడవచ్చు.

"నీ మేధస్సులో కోటి కోటిస్వచ్ఛంద దేశభక్తుల హృదయము లున్నవి. పిచ్చివాడవుకాక ఏమవుతావు?"

"హృదయమున్నవాడు కాబట్టి పిచ్చివాడయ్యాడు."

"ఈ దేశంలో మనిషికొక్క సిద్ధాంతం, గ్రామానికొక్క పార్టీ. ఏ రెండుతలలూ ఒక్కచోటుకు చేరవు."

"సీతమ్మ చనిపోయింది"

"నా హృదయం పగిలింది"

"తాను చనిపోతూ మిమ్మల్ని బ్రతకమని ఆశీర్వదించింది!"

ఇలాంటివి హృదయాలను కదిలించే సంభాషణలు. రచయితలోని ఆలోచనా నైశిత్యానికి అవి మచ్చుతునకలు. కథావస్తువు జగత్ప్రసిద్ధమైన అల్లూరి వీరుని జీవితగాథ; ప్రదర్శనానుకూలమైన రచన. తెనుగు దేశంలోని నాటకసమాజాలు యీ నవకుసుమాన్ని స్వీకరించి కళాదేవిని పూజించగలవని ఆశిస్తున్నాను.

విధేయుడు

విద్వాన్ కణ్వశ్రీ

20—1—1960

త్యాగరాయనగరు
మద్రాసు



# కృతజ్ఞత

మిత్రులు కణ్వశ్రీగారికి నమస్కారములు! పది సంవత్సరముల క్రితం నా కథాసాహిత్యానికి తొలిపలుకులు వ్రాసి నన్ను తెనుగు దేశానికి ఒక రచయితగా పరిచయం చేసి, నాపై అక్షతలు చల్లి, క్షుత మెరుగని సాహితీలతాకన్యకు నా జీవితమును ముడివైచి పౌరహిత్యము గావించిన సహృదయులు, స్నేహబాంధవులు, తెనుగుదేశపు మేటికవిపుంగవులు అయిన మీరు, మళ్ళీ యీనాడు, నేనేవో ఒక నాటకం వ్రాస్తే, మహానగరంలో వూపిరాడనుకూడా తీరికదొరకని మీ చలనచిత్ర సాహితీ పరిశ్రమరంగంనుంచి, ఒక్కక్షణం నాకోసం బైటపడి, నా, 'అభినయం' అనుభవించి, ఆ వుత్సాహపు పొంగులో మీ కలం ముంచి, నాపు మీ దృష్టిలో, 'ఒక్కమాట' వ్రాసి నా భవిష్యత్తుకు కొండంతబలం నిచ్చి, మళ్లీ యీ దినం నన్ను ఆశీర్వదిస్తున్న మీ చల్లటి హృదయాన్ని నేనెన్నటికీ మరువలేను!

రచయిత

# హెచ్చరిక

* * *

ఈ నాటకమునకు సంబంధించిన సర్వహక్కులు, మాకు చెందియున్నవి. కాన మా లిఖితపూర్వ కనుమతి లేనిది యీ నాటకమును ప్రదర్శించుటగాని, లేక చలన చిత్రములలో ప్రవేశింప చేయుటగాని లేక మరేవిధముగానైననూ వుపయోగించటగాని చేయరాదు. అట్లు అనుమతి లేక ప్రవర్తించువ్యక్తులు, సమాజములు, మేముజరుపు సివిల్ క్రిమినల్ చర్యలకు గురికావలసి వచ్చునని యిందుమూలముగా తెలియజేయడమైనది.

ఇట్లు
ప్రకాశకులు

# తొలి ప్రదర్శన



నా, నాటకమును తొలిసారిగా తే 8—1—1960 ది మా నెల్లూరు పురమందిరములో ప్రదర్శించి నాకు ఘనమైన సన్మానముచేసిన మిత్రమండలి; ఆ నాటకములో వివిధపాత్రల నిర్వహించి నా నాటకమునకు జీవంబోసిన కళాకారులు; నాటకవిజయమునకు తోడ్పడ్డ యితర కళాకారులు.

| | | |
|---|---|---|
| నాటక సమాజము | — | ప్రకాష్ థియేటర్సు |
| ఆనాటి అధ్యక్షులు | — | శ్రీ అప్పల ఆంజనేయులగుప్త |
| సీతారామరాజు | — | శ్రీ ఏ. పి. రాయల్ |
| మల్లన్న | — | శ్రీ డి. సుందరం |
| రంగన్న | — | శ్రీ ఆర్. సుబ్రహ్మణ్యం |
| రామన్న | — | శ్రీ యం. రామారావు |
| భీమన్న | — | శ్రీ టి. కృష్ణమూర్తి |
| రూథర్ ఫర్డ్ | — | శ్రీ వై. సుబ్బారావు |
| బాప్టియన్ | — | శ్రీ ఆర్. బి. సింగ్ |
| పిళ్లై | — | శ్రీ వై. శ్రీనివాసులు |
| కవర్ట్ | — | శ్రీ బి. ఆనంద్ |
| ఫైటర్ | — | శ్రీ ఆర్. కృష్ణసింగ్ |

గొడ్డాఖాన్ — శ్రీ టి. యం. కె. మూర్తి
గంగమ్మ — శ్రీమతి బి. యస్. సరోజ
ఫ్లారెన్స్ — కుమారి యం. సౌదామిని

దర్శకత్వం:
శ్రీ ఏ. పి. రాయల్.

సంగీత దర్శకత్వం:
శ్రీ పి. ఆర్. సన్,
శ్రీ యస్. సుబ్బారావు.

నృత్య దర్శకత్వం:
శ్రీ ఐ. సాల్మన్‌రాజ్.

అలంకరణ:
సుందరం అండ్ రాధాకృష్ణమూర్తి

---

# నమస్కారము

ప్రకాష్ థియేటర్స్ వారికి, నమస్కారములు! అందరూ మిత్రులే! అందరినీ అభినందిస్తూ, ఉజ్వల భవిష్యత్తునాశిస్తూ ఆశీర్వదిస్తున్నాను! రాత్రియనక, 'పగలనక నాటకంకోసం కృషిచేసి, నాటకానికి నిజమైన జీవంపోసి, ప్రదర్శనను నెగ్గించేరు. అంతటితో ఆగక, కవిగా నన్ను రంగస్థలంమీద గౌరవించి, మీ కళాహృదయాన్ని వెలారించినారు. అందుకు నా కృతజ్ఞత!

రచయిత.

## రంగస్థల కళాకారులకు ఒక్కమాట!

గంగమ్మ పాత్రను ధరించిన వ్యక్తే ఫ్లారెన్స్ పాత్రను గూడా ధరించవచ్చు. నాటకంలో గంగమ్మ చనిపోయిన పిమ్మట, ఫ్లారెన్స్ వచ్చుటకు కనీసం ఒక్కగంట కాలవ్యవధి యున్నది. ఈలోపల గంగమ్మ పాత్రధారిణియే ఫ్లారెన్స పాత్రనుగూడా నిర్వహించవచ్చు.

అదేవిధంగా రంగన్న పాత్రను ధరించిన వ్యక్తే సింగన్న పాత్రనుగూడా నిర్వహించవచ్చు. అందుకు తగిన వ్యవధి రంగన్న పాత్రధారుని కున్నది.

అలాగే భీమన్న వేషంవేసిన కళాకారుడే, పిళ్ళై వేషం గాని, గోడ్డూఖాన్ వేషంగాని వేయొచ్చు.

ఈ విధంగా యీ నాటకంలోని పాత్రల నిర్వహించే వ్యక్తులను క్లుప్తీకరించుకోవొచ్చు.

# ఈ నాటకములో వచ్చు పాత్రములు

* సీతారామరాజు
* మల్లు
* రామన్న
* రంగన్న
* భీమన్న
* సింగన్న
* రూథర్
* బాస్టియన్
* కవర్ట్
* హైటక్
* పిస్కా
* గాడ్డూఖాన్
* గంగమ్మ
* ఫ్లారెన్స్
* కోయరాజులు
* తెల్లదొరల సిపాయిలు

# అల్లూరి సీతారామరాజు

——★★★——

## తొలిరంగం

[అది ఒక కొండ. ఆ కొండచుట్టూ అడవి. ఆ కొండపై ఒక పెద్ద చెట్టు. ఆ చెట్టుక్రింద నిలువెత్తు ఒక పెద్ద విగ్రహం. ఆ విగ్రహానికి సీతారామరాజు ఒకప్రక్కగా నిల్చొని, పుష్పదళకుంకుమలతో పూజ చేస్తూ వుంటాడు. ఒకప్రక్కగా కోయనాయకు లుంటారు. ఒక్క రామన్నమాత్రం వుండడు. ఇంకొకప్రక్క గంగమ్మ వుంటుంది. ధూపదీపనైవేద్యములతో అర్చనలు జరుగుచూ వుండును. మరియొక మూలగా గంగమ్మ బిడ్డయొక్క వుయ్యాల వుంటుంది.]

సీతా:- త్రిపురాంతకసుందరీ! త్రిభువనలోక రక్షణీ!
మాంపాహి! మాంపాహి! మద్హృదయ పావనీ!

[సీతారామరాజు అమ్మణ్ణికి కర్పూరహారతి నిచ్చి, ఆ హారతిపళ్లెమును గంగమ్మచేతికి అందిస్తాడు. ఆ హారతిని నృత్యభంగిమతో కోయ రాజుల కందించును. అటుపిమ్మట హారతిని అమ్మవారి పాదపద్మముల చెంత వుంచుతుంది. అందరూ కలసి పాటపాడుచూ నృత్యమును చేస్తారు. సీతారామరాజు ఒకప్రక్క నిల్చొని చూస్తూవుంటాడు. మధ్యమధ్య వీరావేశము కల్పించు శంఖు, కొమ్ము శబ్దములు, జయజయ భేరీనాదములు వినిపించుచుండును]

### కోయనృత్య గీతం

అమ్మవు నీవే - లోకానికంతా తల్లివి నీవే
అమ్మ మాయమ్మా - అమ్మ మాయమ్మా ఓ యమ్మా!
అమ్మలగన్నా - ఓయమ్మా ఓ మాయమ్మా!
సాగే పోరాటాం - ఓ సల్లానితల్లీ నీ

సల్లాని దీవెన్లే - నీ మెల్లాని చూపూలే!
ఓ! దుండాగులమ్మా - దేశాముకానీ
దేశములోనే - అడుగూలువేసీ
కన్నతల్లికి బంధాలువేసీ
దాస్యపు సంకెళ్ల వేసేరో
చీకాటిలోనే తోసేరో
బాకూలుపట్టీ - కత్తూలు దూసీ
కొండాలనెక్కీ - అడవూల దాటీ
కదమూ త్రొక్కీ - కయ్యాముతోనే
గెలవాలి రాజ్యం - పోవాలి దాస్యం
అమ్మ మాయమ్మా - ఓ మాయమ్మా
ఆశీస్సే మాకూ - కోటానకోట్ల వీరుల శౌర్యం
వీరూల ధైర్యం - యీ వీరూలధైర్యం.

[నృత్యం అయిపోతుంది. గంగమ్మ తదితరులు ఒకప్రక్క నిల్చొంటారు. సీతారామరాజు రంగస్థలంమధ్యకు వస్తాడు ]

సీతా:- ఈతల్లి ఆశీస్సులతోనే, నేటిదాకా మనపోరాటం నిర్విఘ్నంగా కొనసాగింది! ఈతల్లి ఆశీస్సులతోనే యీ మన్యంలో ప్రారంభమైన ప్రచండవాయువు, పెనుతుఫానై కూకటివ్రేళ్ల తో పాతుకొనియున్న బ్రిటిష్ ప్రభుత్వమును కూలద్రోయగలము. అమ్మా! కాళికామాతా! నా జన్మ భూమి, పరదేశపు కసాయీపరిపాలనక్రింద కటిక దారిద్ర్యంతో క్రుంగిపోతూ, కోటానకోట్ల నీబిడ్డలు, ఆకలితో అలమటిస్తూ ఆక్రందిస్తున్నారు తల్లీ! అమ్మా, జగన్మాతా! కన్నతల్లిఋణం తీర్చుటకే యీదీక్ష బట్టేను తల్లీ! నీ ఆశీస్సులతోనే, నీబిడ్డ యీ యుద్ధాన్ని ప్రారంభించేడు. నీబిడ్డ

కిక అపజయం లేదుకదూ! అమ్మా! నీబిడ్డకు జయంతప్ప అపజయం లేదుకదూ!

[ కాళికాముఖంలో సంతోషం సహారాయైనది. కన్నీరు మున్నీటిగా ప్రవహించింది. అంధకారం అంతా అలుముకొన్నది. బాధతో గూడిన యేవో తెలియని నిరాశావాదపు సంగీత శబ్దములు ఎచ్చటనుంచో విన్పించినవి. ]

సీతా:- అమ్మా! ఏమిటమ్మా నీ సందేశం? ఎందుకమ్మా నీ వదనంలో అంతటి అంధకారం? కళకళ లాడవలసిన నీ నయనజ్యోతుల్లో కన్నీటితెర లెందుకమ్మా? అమ్మా! ఎందుకమ్మా పలకవు?

మల్లు:- బాబయ్యా! అమ్మగారికి శాంతి జరిగించాలి. మేక పోతుల్ను బలిపెట్టాలిబాబూ! మేకపోతుల రక్తంతో అమ్మవారికి శాంతికలుగుతుంది?

సీతా:- నోరులేని మేకపిల్లల్ను బలిచేయడం ధర్మంగాదు. కుట్రలతో, కుటిలరాజకీయాలతో, మన మాతృభూమిని తమ గుప్పెటలో పెట్టుకొని, త్రైతక్కలాడు తెల్లజాతి కిరాతకుల రక్తంతోగాని, అమ్మణ్ణిహృదయం శాంతించదు! ధర్మానికి నిలయమై, సంస్కృతికి ఆటపట్టై, మనజాతికే హృదయమైన పవిత్ర దేవాలయముల శిధిలము జేసి, అచ్చోట రాచబాటల నిర్మించి, ఆ బాటలపై భారతదేశపు సర్వసిరిసంపదలను మూటలుగట్టుకొని బండ్లమీదతోలించు కొనిపోవు ఆ ద్రోహుల రక్తముతోగాని యీ తల్లి శాంతించదు.

మల్లు:- ఔను బాబయ్యా! గోవు మాంసంతిని మదపు టేనుగుల్లా బలిసిన నాయాళ్ల రక్తం అమ్మణ్ణి పాదాలదగ్గర పారించాల్సిందే!

రంగన్న:- పందులమాంసంతిని పడ్డదూడల్లా బలిసున్నారు! బలియ్యాల్సిందే బాబయ్యా! బలి!

గంగమ్మ:- మనుష్యులను నిలువునా దోపిడీచేసి, మనజాతినే పతనముచేసిన పశువులరక్తాన్నే యీ నేలమీద ఒలకబోయాలి!

రం:- ఆరిపోకుండా ఆజాతిరక్తాన్ని ప్రవహింపచేయాలి.

మల్లు:- న్యాయానికి ధర్మయుద్ధంలో అపజయమే అంటదు. మీరుచేసే యీ ధర్మయుద్ధంలో నిజమైన భారతీయుడు, విరోధికి ఒక ప్రక్క-బల్లెమై మీ పోరాటానికి చేయూతనిస్తాడు.

[రామన్న అను మూగవాడు ప్రవేశిస్తాడు. ఆతని ముఖంలో సంతోషం కన్పిస్తుంది. గంగమ్మ, రామన్నకు దగ్గరగా వస్తుంది. రామన్నను జూచి అమాయకంగా నవ్వుతుంది.]

రామన్న:- హాో! హాో! హాో! హ్యా! భో!

గం:- చింతలపల్లి పోలీస్ స్టేషన్ ధ్వంసమైంచదా?

రా:- హ్హాఁ! హాో! హ్యా! బూ! బూ! భో!

గం:- ఈ పోరాటంలో తెల్లవాండ్లు కూలిపోయేరా?

రా:- హ్యాఁ! హాో! హ్యా, హ్యా! హాో!

[రామన్న, ప్రక్కనున్న బాకును తీసుకొని, తెల్లవాడిని చంపునట్లు నటనచేస్తూ, సీతారామరాజుకు నమస్కారం చేస్తాడు. రామన్న నటనకు సీతారామరాజు మందహాసితుడౌను. అందరూ నవ్వుతారు. రామన్న సిగ్గుపడుచూ అచ్చటనుంచి వెళ్లిపోతాడు.]

మల్లన్న:- చింతలపల్లి పోలీస్ స్టేషన్‌పై దాడి మనకు మరో విజయాన్ని చేకూర్చింది.

సీతా:- పడాలవీరుడు ప్రచండభాస్కరుడై, పశుబలానికి కేంద్రమైన చింతలపల్లి పోలీస్ స్టేషనను భీభత్సంచేసేడు.

రం:- పడాలు, అపజయమెరుగని అకుంఠిత భుజబల మహా పరాక్రమవంతుడు!

గం:- కాబట్టే పడాలు, అశ్వదళానికి ప్రథమనాయకుడైనాడు!

రం:- పడాలపేరు చెప్తేనే, పసిగుఱ్ఱముసైతము పంచకళ్యాణి వలె నురుగులుతీసే జలప్రవాహంలా, పరుగులుతీస్తుంది.

[రామన్న పరుగెత్తుకొంటూ వస్తాడు. గూఢచారి వెలుపలనున్నట్లు సైగజేస్తాడు. పిల్లిఅడుగులు వేస్తాడు. కొంగజపం చేస్తాడు, రామన్న వెలుపలవైపు చేయిచూపెట్టాడు; అవైపే రామన్న వెళ్లిపోతాడు. మల్లన్న, రామన్నను అనుసరిస్తాడు. మరియొకవైపునుంచి వెంటనే గంగమ్మకూడా వెళ్లిపోతుంది. రామన్న మల్లన్న కలసి ఒకవ్యక్తిని తీసుకవస్తారు. ఆ వ్యక్తి పేరే భీమన్న. అతడు తెల్లవారి గూఢచారి. మల్లన్న గూఢచారిని రంగంమీదకు లాగుకొనివచ్చి క్రిందకు నెట్టాడు. రామన్న కొట్టబోయినట్లు వుడికించి రంగస్థలంనుంచి వెళ్లిపోతాడు. మల్లన్న, గూఢచారిని పైకి లేవదీస్తాడు.]

మల్లన్న:- ఛీ! సిగ్గులేదూ! పరజాతికి బానిసవై, కన్నతల్లి కంఠంమీద కత్తినూరేదానికన్నా, కటకు ఖడ్గానికి నీవూ బలికావడమే మేలు!

రం:- ఈగడ్డమీద పుట్టి, యీగడ్డను తెగనరకే కసాయీ జాతికి అండగా నిలుస్తావా? వారిచ్చేరూకలతో పరమాన్నం త్రాగేదానికన్నా, నీతితో గంజినీళ్లు త్రాగడం మంచిది. డబ్బుకు బానిసలౌతారా ?

గూఢచారి:- బానిసనుకాను. నా ఉద్యోగధర్మాన్ని నెరవేర్చుకొంటున్నాను. ఇది నా దొరల వుత్తర్వు!

[గూఢచారి మాటలకు రంగన్న, మల్లన్న రెచ్చిపోయి కొట్టబోతారు.]

సీతా:- ఆపండి! కొట్టొద్దు! ద్దొ-ర! ఎవరు నీదొర? ఏమిటా వుత్తరువు? ఏమిటి నీ వుద్యోగం? ధనంకోసం, నినుకన్న నీతల్లిని గొంతుకోయడం నీ వుద్యోగమా! నీ ఒక్క కడుపు కోసరం, కోటానకోట్ల నీసోదరులను అనాథులుగా చేయడం నీ వుద్యోగమా! నీ భార్యాబిడ్డల చారెడు నూకలకోసరం, నీ దేశంలో, నాలుగుమూలలా నాట్యమాడుచున్న వేయి నాలుకల నాగుబాముకు పాలుబోయడం నీ వుద్యోగమా!

ద్దొ-ర? హ్హు! దొర! ఎవడు దొర? ఎవడు నీదొర! ఎవడు నీకుదొర? వేనవేలమైళ్ల దూరంనుంచి పొట్టనరచేత బెట్టుకొనివచ్చి, వ్యాపారంకోసం మనగడ్డమీద దిగి, మన కండ్లల్లో దుమ్ముకొట్టి, మనకు మనకుసంకెళ్లువేసి, మన సిరి సంపదలను కొల్లగొట్టి, మనలను బికారులనుచేసిన దారి దోపిడిగాండ్లా, నీదొరలు?

బాబూ! ఇది ఎంతతప్పూ, ఎంత అవినీతి, ఎంతటి ఆత్మద్రోహం. కన్నతల్లిని తెగనరికే హంతకుని రక్తసిక్తఖడ్గానికి పదునుబెట్టేది, తల్లిపాలును త్రాగిన తెనుగుబిడ్డేనా!

నీవు నా సోదరునివి. ఈ ఖడ్గము యీ బాణము నా సోదరులమీదకి కాదు. సోదరునికీ సహోదరునికీమధ్య అంతః కలహాలు రేపి, గ్రామానికీ ప్రక్క గ్రామానికీమధ్య కారుచిచ్చు బెట్టి, ఒక అయోమయ అంధకారపరిస్థితిని నా జన్మభూమి మీద కల్పించి, నా కోటానకోట్ల భారతీయ సోదరులను దిక్కులేనివారిగా జేసి, నవ్వులతో, పైరులతో కిలకిల మనిపించ వలసిన నా దేశంలో అనుక్షణమూ ఆర్తనాదాలు, అడుగడుగునా ఆకలిదప్పుల భయంకర శోకాలు!

[ సీతారామరాజు గూఢచారిని ఒకవైపు చూపెట్టుచూ ]

సోదరా! అటుచూడు! అవియేమిటో తెలుసా! నీకోసం, నీజాతికోసం, నీ జన్మభూమికోసం, పోరాడి,పోరాడి, తుదకు హంతకుల మోసాలకు బలియైపోయిన నీ సోదరులసమాధులు!

[ మరియొకవైపు చూపెట్టుచూ ]

ఇవిగో! యిటుచూచేవా? ఎవరివా ఎముకలగూళ్లు? తెనుగుతల్లుల ముక్కుపచ్చలారని వేలాది శిశువుల కంకాళాలు!

[ మరియొకవైపు తిరుగుచూ, పైవైపు చూపెట్టాడు. ]

ఆ రక్తపుచారలేమిటి? యేమిటా రక్తపుచారలు? నీ తండ్రులగుండెల్లోనుంచి చిందించిన కవోష్ణరక్తం!

[ మరియొకదిక్కుకు చూపు త్రిప్పుచూ ]

సోదరా! పూర్తిగా కండ్లిప్పు! చూడు! అటుచూడు! ఆ సమాధిప్రక్కనే దుమ్ములో పొర్లాడుచున్న శవం ఎవరిదో

తెలుసా! బిడ్డకు అన్నంపెట్టలేక, ఆకలితో బిడ్డ చనిపోతే, ఆ బిడ్డశవానికి సుంకం చెల్లించలేక, మానాన్ని దాచుకొను మూరెడు గుడ్డలేక, తనూ ఆత్మహత్య చేసుకొన్న తెనుగుతల్లి! ఆ హత్యకు వెనుక వికటాట్టహాసం చేస్తున్న, ఆ ఘోరహంత కుడు నీకు కన్పించడములేదా?

[ మరోవైపున తల క్రిందవైపుకు దించి]

అదిగో! అదిగో! అటుచూడు! తెనుగునాటి ఆడబడుచుల నేలరాలిన వేలాది పచ్చటి మాంగళ్యసూత్రాలు! తెల్లదొరల మీదకి త్రాచులై విరచకబడమని ఆ అభాగ్య మాంగళ్య సూత్రాలు నీకు ప్రబోధం చేయడంలేదా? నీలో భారతీయుని రక్తం ప్రవహించడంలేదా? నీ తమ్ములను, నీ తల్లులనుచంపి, ఆ సమాధులమీద సామ్రాజ్యాలు నిర్మించే ఆ ద్రోహుల పంచనే నీ వునికిని ఏర్పుకొనడం ద్రోహంకాదా?

[ గూఢచారి సీతారామరాజు కాళ్లమీద బడ్డాడు. ]

గూఢచారి:- రాజూ! క్షమించండి. ఈనాటినుంచీ తెల్లోడి కొలువుకు పోను. నేను మీ పాదాలదగ్గరే వుంటాను. మీరు నిజంగా దేముడే! నీవు రాజువికాదు! సాక్షాత్తూ భద్రాద్రిరాముడివి!

సీతా:-నీవు నిజమైన పరివర్తనేపొందితే, అదిగో, అమ్మదగ్గరకు పోయి ప్రమాణంచెయ్యి.

[ గూఢచారి కాళికాంబదగ్గరకు పోయి తలవంచి నమస్కరించి వెనుదిరిగి సీతారామరాజుదగ్గరకు వస్తాడు. ]

సీతా:- నీపేరేమి?

గూఢ:- భీమన్న బాబూ!

సీతా:- సరే! సోదరులారా! భీమన్న కూడా నేటినుంచి మనవాడే!

భీమ:- బాబయ్యా! మీరు జాగ్రత్తగా వుండండి! గూఢచారులు మిమ్ములను వేయికండ్లతో గాలిస్తున్నారు. చెట్టుచెట్టునా, పుట్టపుట్టనా మిమ్ములను గాలిస్తున్నారు.

సీతా:- మీ అందరి అండదండ లున్నంతవరకు నాకేమీ పర్వాలేదు. నిప్పులా పితూరీ వేయినాలుకలతో మింటికీ నింగికీ చాచకొనుచున్న యీ శుభసమయంలో, భారతీయుల దమ్ము ఒక్కుమ్మడిగా పోరుసల్పితే, యీ తెల్లజాతి పాలన మరియొక క్షణములో అంతము కాగలదు.

మల్ల:- కానీ, ఐక్యత యేది?

[గంగమ్మ వస్తుంది. లోపలనుంచి వస్తూనే]

గం:- మల్లన్నా! నీవేనా నిరాశావాదానికి నాందీ బల్కుతున్నావ్! మల్లన్న మహావీరుని నోటినుంచి యికమీదట మేమూ, మాటలను వినకూడదు.

[ప్రక్కనేవున్న వుయ్యాలదగ్గరకు పోయి, తన బిడ్డదగ్గర నిల్చొంటుంది]

సీతా:- ఐక్యతలేదని, నిరాశపడకూడదు మల్లన్నా! నివురుగప్పిన దేశభక్తి, భారతీయుని హృదయములో గూఢమై యున్నది. ఇపుడు కావలసినది, ఆ నిప్పును గ్రమ్మిన బూడిదను పారద్రోలడమే! ఆ పరిస్థితులలో నిరాశావాదం

పనికిరాదు మల్లన్న. క్రిష్ణదేవపేట పోలీస్ స్టేషన్ పై దాడి విషయాలు......

రం:- అదుగో, రామన్న వస్తున్నాడు బాబూ!

[రామన్న ఎంతో సంతోషంతో వస్తాడు. అచ్చం ఒక తెల్ల సైనికుని వేషంలో వుంటాడు. కానీ కాళ్లకు బూట్లుండవు; యూని ఫారం వుండదు. చేతిలో తుపాకి, నెత్తిన హేటు, పేంటు వుంటవి. మార్చింగ్ చేస్తూవస్తాడు. 'హుప్' అనంటూ మిల్ట్రీవానివలె ప్రక్కకు కాలుకొట్టి సెల్యూట్ చేస్తాడు.]

రామ:- హాఁ! హాఁ! హాఁహూ! హా! హాఁ! హాఁ!

గం:- క్రిష్ణదేవ పోలీస్ స్టేషన్ నాశనమైనదా.

రామ:- హా.! హాహా!

[రామన్న తన నెత్తిమీదవున్న టోపీని ప్రక్కనేవున్న మల్లన్న నెత్తిమీద పెడ్తాడు. తనచేతినున్న తుపాకిని అతనిచేతికిచ్చి పట్టుకోమని సైగచేస్తాడు. వెంటనే మల్లన్నను ప్రక్కనున్న బాకుతీసుకొని దానితో పొడవబోతాడు. మల్లన్న ప్రక్కకు తప్పుకొంటాడు. ఆవిధంగా బ్రిటిష్ వాండ్లంతా వెళ్లిపోయేరని సంజ్ఞచేస్తాడు.]

గం:- రామన్నా, మనవాండ్లు బ్రిటీష్ వాండ్లను చంపి పార వేసేరా?

రామ:- హా! హాహా! (ముఖంలో అత్యధిక సంతోషం)

గం:-మనవారిధాటికి ఆగలేక తెల్లజాతికాళ్లకు బుద్ధిచెప్పిందా?

రామ:- హా! హాఁ! హాహాఁ! తుర్! తుర్! తుర్! హాఁ! తుర్!

గం:- ఓహాఁ! తుపాకులు పారేసి, చెట్లప్రక్క నక్కుతూ, పుట్లప్రక్క దోగాడుచూ వెళ్లిపోయేరా?

రామ:- హా! హాహా!

గం:- పోయిరా, రామన్నా! మిల్ట్రీదొరా! పోయిరా!

[‘దొర’ అనే పదాన్ని తనయందు వాడినందులకు రామన్నకు కోపంవస్తుంది. గంగమ్మమీదకు కొట్టబోయినట్లు దూకబోతాడు. ప్రక్కనేవున్న గంగమ్మభర్త రంగన్న, రామన్నమీదకు వురకపోతాడు. రామన్న భయపడి పరుగెత్తిపోతాడు. అందరూ నవ్వుకొంటారు.]

మల్లు:- కాళమ్మదీవెనలతో యేపనిజేసినా దానికి అపజయమే అంటదు బాబయ్యా! ఇది ధర్మయుద్ధం బాబయ్యా!

రం:- ధర్మయుద్ధంలో అపజయమే లేదు.

గం:- ఇది నీతికి, అవినీతికి, ధర్మరక్షణకు అధర్మప్రాబల్యానికి, జన్మభూమి స్వాతంత్రసాధనకు, అక్రమరాజ్య విస్తరణా పిపాసకు.....

రం:- ......మధ్య జరుగుచున్న మహాసంగ్రామం.

మల్లు:- ఈ రణభూమిలో అధర్మంతో, కళ్లుమూసుకుపోయిన కసాయిజాతి అంతరించాల్సిందే!

సీతా:-అదితప్పదుమల్లన్నా! అధర్మంతో, అధికార దుర్మదాంధతతో, రాజ్యవిస్తరణావ్యామోహంతో కళ్లు మూతలు గట్టుకొని తప్పత్రాగినవానివలె తందనాలాడుచున్న యీ తెల్లజాతిపతనము తప్పదు, అది దైవములిఖించిన ధర్మవ్రాలు!

రంగన్నా! రాళ్లపల్లి పోలీస్‌స్టేషనుపైదాడి, యేమైనదో తెలిసికొనిరా!

రం:- అలాగే బాబయ్యా! [వెళ్ళిపోతాడు]

భీమన్న:- రాళ్లపల్లిలో మనసైన్యాన్ని ఎదిరించే శక్తి తెల్లోండ్లకు లేదు. గ్రాందీసీసాల పంపకాల్లో మొన్ననే పెద్ద కీచులాటలొచ్చి దొరలు చీలిపొయ్యారు! తోటాలు లేని తుపాకులు రెండుమూడొందలదాకా వున్నవి. అచ్చటి మన భారతీయ సిపాయిలకు ఆ దొరలంటే అసలే గిట్టదు. కాబట్టి జయంమందే బాబయ్యా!

సీతా:- చాలా సంతోషవార్త చెప్పేవు భీమన్నా!

[రంగన్న పరుగెత్తుకొంటూ వస్తాడు. చేతిలో కొన్ని తుపాకులు పట్టుకొనివచ్చి వాటిని సీతారామరాజు కాళ్లముందర వేస్తాడు.]

రం:- రాళ్లపల్లి పోలీస్ స్టేషన్ నామరూపాల్లేకుండా నాశనమైంది.

సీతా:- ఎన్ని తుపాకులు? ఎన్ని తోటాలు? ఎన్ని కత్తులు?

రం:- నిన్న మనపితూరీలో కలసిన ప్రక్కగూడేనికి యీ తుపాకులు కత్తులు సరిపోతవి.

సీతా:- వెంటనే వారికి తర్ఫీదివ్వండి! క్రొత్త దళానికి వెను వెంటనే గెరిల్లా పోరాటంలో తర్ఫీదివ్వకండి! మెట్టుకు మెట్టు ఎక్కిపోనివ్వండి. రామన్న దండులో వారిని కలపండి. రామన్న దండుకు అప్పుడు సరైన బలం చేకూర్తుంది.

రం:- రామన్నకు బలమే అక్కర్లేదు బాబయ్యా! ఉపాయంతోనే యే పనైనా చేస్తాడు.

[ ఎచ్చటినుంచో టార్జాన్ వలె, హూ! ఒహ్హో! అనే బిగ్గరశబ్దాలు, కొమ్ము శంఖుశబ్దాలు భీభత్సంగా విన్పిస్తవి. రంగస్థలంమీదనున్న తుపాకులను, కత్తులను అక్కడున్నవారు దాచుతారు. రంగస్థలంమీదనున్న వారందరూ దాగుకుంటారు. సీతారామరాజు ఒకప్రక్కగా నక్కుతాడు. రామన్న పరుగెత్తుకొంటూ వస్తాడు. చేతిలో ఒకగొడ్డలివుంటుంది. మరి యొక చేతిలో పచ్చికట్టె ఒకటి వుంటుంది. రామన్న భయపడ్డవానివలె నటిస్తూ గొడ్డలిని కట్టెను క్రిందపడవేసి పెద్దగా అరుస్తాడు. బాష్టియన్ నిప్పులు చిందిస్తూ మండిపడ్తూ వుంటాడు.]

బాష్టియన్ :- ఎవరునీవు ?

రా:- భో! హూ! భో! [ 'నేను కోయరాజుని', అన్నట్లు నటన ]

బా:- ఓవ్ ! నీవు కోయరాజువా ? నీకూ మాటలురావా ?

రా:- ఓ ! ఓహూ !... [ మాటలు వచ్చునన్నట్లు నటన ]

బా:- మాటాలువస్తే ఏందుకు మాటలాడావు ?

రా:- ఓ ! ఓహూహూ ! హూ !... [ నాకు తెల్లవారితో మాటలాడను యిష్టంలేదు అన్నట్లుగా నటన ]

బా:- యూా ఫూల్ ! నీకు మా బ్రిటీష్‌వాండ్లతో మాటలాడాను యిష్టములేదా ?

రా:- హూ ! హూహూ !... [ యిష్టములేదు బ్రిటీష్‌జాతి హీనజాతి. ఆ జాతితో మాటలాడను నాకిష్టములేదు. అన్నట్లు నటన]

బా:- మాతో మాటలాడటం నీ గౌరవానికి తక్కువా ?

రా:- హూ ! హూ ? భో!... [ గౌరవానికి తక్కువేనన్నట్లుగా నటన. హుంధాతనం ప్రదర్శన ]

బా:- మా ఆస్థులను అనుభవించటానికి తోంకు మక్కువ ఎక్కువా!

రా:- హాఁ! హాఁహాఁ!... [ఆచెట్లను దేశసంపదను చూపెట్టూ తన గుండె తట్టి అవంతా తనదే నన్నట్లు నటన. భూమిని రెండు చేతులతో తట్టుతూ యీ భూమి ఎవరబ్బదన్నట్లుగా నటన. ప్రశ్నా పూర్వక నటన. ఈ భూమి తనదే నన్నట్లుగా నటన.]

[బాస్టియన్, రామన్నను హంటర్‌తో కొట్టబోతాడు. రామన్న గగ్గోలుగా అరుస్తాడు.]

బా:- వాట్ డంబ్ మేన్? ఏంనుకు పెద్దపెద్దగా కేకలు పెట్తావు? నీవు చాలా చెడ్డమనిషివి యిండియన్!

రా:- హాఁ! భోఁ! హాఁహాఁ!... [కోపముగా నటన]

బా:- హాఁ! నీవు యిండియన్ టార్జానువా?

రా:- హాఁ! హాఁహాఁ!... [ఔనన్నట్లుగా తృప్తిగా నవ్వుచూ నటన]

బా:- హాఁ! ఇండియన్ టార్జాన్! నీవు చెట్టుమీద మా యొక్క అధికారము లేకుండా ఏందుకు యెక్కినావు? మేము వచ్చే సిగ్నెల్సును మీరాజుకి చెప్పేటందులకా?

రా:- హాఁ! హాంహాఁహాఁ! [నేను పండ్లను కోసితినుటకు చెట్టు ఎక్కినాను, నేను రాజు గూఢచారినికాదు, అని నటన]

బా:- ఓహ్! మన్యానికి నీవు రాజు సి ఐ.డి. వి కాదా! నీవు పాండ్లను తినేటందులకు చెట్టుకు ఎక్కినావా! ఎవరి వ్రూత్త ర్వుతో నీవు యీ చెట్టును యెక్కినావు?

రా:- హాఁ! హాఁహాఁ! హాఁ! [మా చెట్లను ఎక్కి పండ్లు కోసి కొనుటకు మీ వుత్తర్వు దేనికి? అసలు నీవు ఎవడివి? అని నటన]

బా:- డంబ్ మేన్! నీవు చేసే యీ అక్రమపనులకు యీ రైఫిల్ జవాబు చెప్తుంది! [రైఫిల్ రామన్నకు గురిబెట్టి కాల్చబోతాడు. ఎచ్చటనుంచో సీతారామరాజువచ్చి గురిబెట్టియున్న రివాల్వరుకు ఎదురుగా నిలబడ్తాడు.]

బా:- హూ ఆర్ యు?

సీతా:- ఐ యాం ది సన్ ఆఫ్ దిస్ సాయిల్, ది సీతారామ రాజు!

బా:-హోవ్! ఆర్ యు...? [భయంతో వొణికిపోతాడు]

సీతా:- యస్! ది నైట్ మేర్ ఆఫ్ యువర్ బ్రిటిష్ ఎంపైర్!

బా:- హోఁ! తమరేనా? [భయం యింకా పూర్తిగా వదలిపోలేదు]

సీతా:- అవును! నేనే అల్లూరి సీతారామరాజుని.

బా:- తమరేనా యీంత పెద్ద రివల్యూషన్‌ను ప్రారంభించినది?

సీతా:- అవును! ఏం?

బా:- దేశములో అలజడి లేవదీయడము తప్పుగాదా?

సీత:- దేశములో అలజడి! నీ బుర్రలో అలజడి! నీ సామ్రాజ్యవాదపు హృదయంలో అలజడి!

[బాస్టియన్ వుగ్రుడై పోతున్నాడు. దొరికిన విరోధిని చంపాలనే క్రౌర్యం ముఖంలో వికటాట్టహాసము చేయుచూ కన్పిస్తుంది.]

బా:- హాఁ! నీ అంత్యకాలము చాలా సమీపమునకు వచ్చి యున్నది కాబట్టే, నీవు నాకు దొరికి యీ విధముగా అక్రమముగా మాటలాడుచున్నావు. ఇప్పుడు, యీ బాస్టియన్, యీ యిండియన్ హీరోని ఫైర్ చేయబోతున్నాడు.

[బాస్టియన్ గురిపెట్టియున్న తన రైఫిల్‌తో సీతారామరాజుని కాల్చబోతాడు. రామన్న ఆ రైఫిల్‌ను చేతితో ఎగరకొట్తాడు. క్రింద బడ్డ రైఫిల్‌ను సీతారామరాజు అదిమిపెట్టతాడు. బాస్టియన్ వెనక్కు తిరిగి పెద్దగా అరుస్తాడు.]

బా:- సోల్జర్స్! కమాన్! అరెస్ట్! రష్! కవరప్! అరెస్ట్ దిస్ టైగర్!

సీతా:- [పెద్దగా నవ్వుతూ] బాస్టియన్! హ్హూ! నీవు తీసుకొని వచ్చిన సైన్యం చెట్టుకు ఒక్కొక్కరు చొప్పున వ్రేలాడుచున్నారు. నీ అరుపులు నిష్ప్రయోజనం! నీ తెల్లజాతి కోతులు, హాఁ! అరుగో! ఒక్కొక్క వెదురుకు ఒక్కొక్క నీ తెల్లజాతికోతి పట్టుకొని వ్రేలాడుచున్నది!

[బాస్టియన్ ఒక ప్రక్కతిరిగి చూస్తాడు. సైన్యమంతా వెదుళ్ళకు కట్టబడియున్నట్లు లోపల కన్పిస్తుంది. బాస్టియన్ క్రుంగిపోతాడు. బాస్టియన్ గుండెలు అదిరిపోతవి; కాళ్ళు వొణికిపోతవి.]

బా:- [పెద్దగా] సోల్జర్స్! కెప్టన్ బాక్స్! సార్జంట్ కరియో!

సీతా:- బాస్టియన్! నీ సోల్జర్స్ ప్రాణాలు ఎప్పుడో ఎగిరి పోయినవి!

బా:- కెప్టన్ బాక్స్! యూ టూ! కరియో, మై రైట్ హేండ్! అన్‌ఫార్చునేట్ డే; ది మోస్ట్ అన్‌ఫార్చునేట్ డే! ది బ్రిటిష్ లైన్స్ నెవర్ స్లేష్! గాడ్! ఓ మై గాడ్!

సీతా:- [వెటకారంగా] గాడ్! మై డియ్యర్ గోష్ట్! యిప్పుడు చెప్పు! బాష్టియన్! యిప్పుడు చెప్పు! ఈ రామన్నను దండించుటకు గల కారణం?

బాష్టి:- ఈ అడవిలోని చెట్లను మా అధికారము లేకుండా కొట్టుచున్నాడు. అది పెద్ద నేరము.

సీతా:- ఈ వృక్షసంపద ఎవరిది? భిక్షాటనకు బైలుదేరిన బికారి వానివలె వేనకువేల మైళ్ళ దూరంనుంచి వచ్చిన నీదా లేక తరతరాలనుండి యీ గడ్డమీదనే పుట్టి, యీ గడ్డమీదనే పెరిగిన కోయరాజులదా యీ అనుభవం!

బాష్టి:- మాది! మా బ్రిటిష్ ప్రభుత్వమునకు హక్కు యీ సంపద!

[బాష్టియన్ మాటలు విని మల్లు, రంగన్న భీమన్న లోపలనుంచి వస్తూ బాష్టియన్ మీదకు దుముకబోతారు. రామన్నకూడా యిప్పుడు బాష్టియన్ మీదకు దుముకబోతాడు. సీతారామరాజు బాష్టియన్‌ను యీ క్రింది ప్రశ్నలు అడిగి వారి నీతిని విమర్శించుచున్నప్పుడు రామన్న అంగుకతగ్గనటన చేస్తువుంటాడు. బాష్టియన్ మీదకు కోయలు తుముకకుండా సీతారామరాజు నివారిస్తాడు. బాష్టియన్ షర్టు కాలర్‌ను సీతారామరాజు వురివేసినట్లు గట్టిగా పట్టుకొంటాడు.]

సీతా:- ఇప్పుడు చెప్పు! ఈ భారతదేశపు అనుభవం ఎవరిది?

బా:- (వణుకుచూ) భా...ర...తీ...యు...లది!

సీతా:- కానీ యిప్పు డెవ రనుభవిస్తున్నారు?

బా:- మేము! బ్రిటిష్ వాండ్లము.

సీతా:- కాబట్టి ఏది తప్పు?

బా:- మేము చేస్తున్నది తప్పు!

సీతా:- అది ద్రోహంకాదా?

బా:- ఔను సార్!

సీతా:- కాబట్టి, ద్రోహం చేసినవాడికి శిక్ష యేమిటి?

బా:- మ...ర్డ...ర్ సార్! క్షమించండి సార్!

సీతా:- నిజము చెప్పినందులకు క్షమిస్తున్నాను! దాసోహ మన్నందులకు శిక్షలేకుండా పారిపొమ్మంటున్నాను.

[లోపలనుంచి గంగమ్మ వస్తుంది. వస్తూవస్తూనే యీ మాటల్ను ఆతృతతో చెప్తుంది.]

గం- బాబయ్యా! పాముకు పాలుబోయొద్దు. దొరికినప్పుడే చంపండి దాన్ని, వదలొద్దు. అది విషాన్నే కక్కుద్ది. వెంటనే చంపండి.

బా:- సార్!

గం:- (వెటకారంగా) స్సార్! మా కాలిమీద తెల్లగోర్! సారంట!

బా:- అయ్యా! దయార్ద్రహృదయము కలిగిన సీతారామ రాజుగారూ! నన్ను క్షమించండి. నాకు చిన్నచిన్న బిడ్డలు వున్నారు. నేను చనిపోయినచో, నాయొక్క చిన్నచిన్న పాపాలు బాధపడ్తారు! సార్! మీరు చాలా మంచివాండ్లు సార్! నన్ను క్షమించి వదలండిసార్!

గం:- ఛీ! ఎన్నివేల మా కుటుంబాలను నీ జాతి కూల్చలేదు, ఎన్నివేలమంది చిన్నారిపాపలను తల్లుల ఒడుల్లోనే

నీ నీతిలేని జాతి చిత్రహింసలు చేయలేదు. అప్పుడు మీ బిడ్డలు మీకు జ్ఞాపకం రాలేదూ? సిగ్గులేని పిఱికిపందా! అందితే జుట్టూ, అందకపోతే కాళ్ళూ!

సీతా:- దాసోహమన్నాడు! రక్షించమని ప్రాధేయ పడుచున్నాడు. 'దేహీ'యన్న వానిని యీ భారతీయహృదయం, ఎందువల్లనో శిక్షించలేకున్నది! దాసోహమన్న శత్రువుని యీ హిందూహృదయం క్షమించమని ప్రబోధం చేస్తున్నది. బాస్టియన్! వెళ్ళిపో! న్యాయంగా బ్రతికేదానికి ప్రయత్నం చెయ్యి.

గం:- ఓడలుదోచే దొంగవు కావొద్దు. ఎక్కడినుంచి బైలుదేరేవో, అక్కడికే నేరుగా చేరుకో! ఎల్లకాలమూ మోసంచేయొద్దు! వెళ్ళిపో!

[బాస్టియన్ ముఖంలో సంతోషం తాండవిస్తుంది. అక్కడున్న వారందరికి సెల్యూట్ చేసి, ఒక క్రమపద్ధతిలో వెనక్కుతిరిగి వెళ్ళిపోతాడు.]

సీతా:- భీమన్నా! బాస్టియన్, తన తుమ్మలపెంట స్టేషన్‌కు పోకముందే, నీ దళంతో ఆ తుమ్మలపెంట స్టేషన్‌ను కొల్లగొట్టు. మందుగుండు సామగ్రినంతా స్వాధీనం చేసుకొన్నపిమ్మట, స్టేషన్‌ను నామరూపాల్లేకుండా సర్వనాశనం చెయ్యి.

భీమ:- అలాగే బాబయ్యా!

[భీమన్న వెళ్ళిపోబోతాడు. రామన్న, భీమన్న చేయినిపట్టుకొని కాళికాఅమ్మవారి దగ్గరకు తీసుకపోయి నమస్కారం చేయమంటాడు.

భీమన్న అలాగే చేస్తాడు. ఆ తర్వాత, రామన్న భీమన్నను ఆశీర్వదిస్తూ అమ్మవారి దగ్గరున్న కుంకుమను తీసి భీమన్నకు బొట్టుపెట్టాడు. రామన్న చేసిన యీ పనికి అందరిముఖాలూ సంతోషంతో వికసిస్తవి. భీమన్న అమ్మణ్ణికి నమస్కరించి, అటుపిమ్మట సీతారామరాజుకి నమస్కరిస్తాడు. ఆతర్వాత రామన్నతో కరచాలనం చేసి భీమన్న వెళ్ళిపోతాడు.]

సీతా:- సోదరులారా! మనలోని మంచితనంతో బాటు మన లోని పౌరుషాన్ని కూడా తెల్లజాతి రుచిచూచింది! రామన్నా! రాజు వొమ్మంగికి రేపురాత్రి 12 గంటల, 9 నిముషములకు దాడి జరుగుతుందని మిరపకాయ టపాద్వారా కబురు పంపండి. మల్లూ! ఎల్లుండి మిట్టమధ్యాహ్నం ఒంటి గంట విన్నించేసమయంలో నర్సీపట్నం, నాగన్నపురం, ఏలేశ్వరం, ఏరువాకపురం పోలీస్ స్టేషన్లమీాదకు దాడి జరుగుతుందని పలురకాల టపాలద్వారా వార్తల నంపండి!

గం:- దమనపల్లెలో మరో పోలీస్ స్టేషన్ తయారైనది.

సీతా:- ఎవరు చెప్పేరు?

గం:- సీతమ్మ దళంనుంచి వర్తమానం అందింది. మలబారు సైన్యంతో దమనపల్లె నిండిపోయింది. మిల్ట్రీ కోర్టులను స్థాపించేరు. న్యాయ నిర్ణేతలు, దండనాధికారులు, అంతా మానవత్వాన్ని మరచిన మిల్ట్రీసిపాయిలే!

సీతా:- మీారొక్కొక్కరూ ఒక్కొక్క పరశురాముడు కండి. దమనపల్లెనే దావాగ్నిలా మార్చిన కవర్ట్ హైటర్ హంతకులను చంపి వారి శవాలను మన్యపు సరిహద్దుల్లో వ్రేలాడ తీయండి. తల్లుల ఒడులలోనే తముకన్న సంతతిని కత్తు

లతో పొడిచిచంపిన రాక్షసుల రక్తాన్ని యీ మన్యపు దేవత కాళ్లదగ్గర ప్రవహింపచేయండి. గంగమ్మా! వెళ్ళి వస్తా! నీభర్త దమనపల్లె దండుకు నాయకత్వం వహిస్తు న్నాడు. వీరతిలకం దిద్ది, యుద్ధానికి సన్నిద్ధుడౌతున్న నీ భర్తకు వీడ్కోలు చెప్పి వీరపత్ని వహించుకో! మీ చిరంజీవి మిమ్మల్ని మించిపోతాడుగా! గంగమ్మా! సింహపు పిల్ల సింహమేలే! పులికి మేకపిల్ల పుట్టదు!

[సీతారామరాజు ఒకప్రక్కగా నిల్చొంటాడు. గంగమ్మ రంగన్న దగ్గరకు వస్తుంది. తనదగ్గర దాచియున్న పిడిబాకుతో తన చూపుడు వ్రేలిపై పొడిచి, ఆ చిందే రక్తంతో రంగన్న నుదుటున బొట్టు పెట్తుంది. యిద్దరూ కలసి ఉయ్యాలలో నున్న తమ బిడ్డను చూస్తారు. గంగమ్మ రంగన్నలు యిద్దరూ ఒకరివైపు మరియొకరు ఒక్కక్షణం చూచుకొంటారు. ఆతర్వాత రంగన్న సీతారామరాజుకు నమస్కారం చేస్తాడు.]

సీతా:- రంగన్నా! దమనపల్లె దాడిని చరిత్రాత్మకం చెయ్యి. దమనపల్లె దుర్మార్గులను దుమ్ములో కలుపు. దమనపల్లె అత్యాచారాలకు అంత్యక్రియలు సలుపు.

వీరులారా! ఒక్క దమనపల్లె దురంతాలనేకాదు; ముమ్ముందు యీ భారతదేశములో జరుగుచున్న హత్యా కాండలకు సమాధులు కట్టండి. ఈ తెల్లజాతి పాలనకు స్వస్తి జరగాలి. ఆ భారత మహా స్వతంత్ర్యసంగ్రామంలో పాపలు సైతము పౌరుషాగ్నుల చిందించే చిచ్చులపిడుగులు కావల యును.

గం:- ఔను బాబయ్యా! రంగన్నమామేకాదు వీరుడు; రం గన్న బిడ్డకూడా ఒక మహావీరుడే! నా బాబుకూడా ఒక

సైనికుడు కావాలి! నేడు వీరపత్నిమాత్రమే! రేపు వీర మాతనుకూడా!

సీతా:- గంగమ్మా! నీలాటితల్లులు గ్రామగ్రామమునా వర్ధిల్లాలి! ఒక్కొక్క తల్లి ఒక్కొక్క వీరుడ్ని తమ దేశపు స్వాతంత్ర్య పోరాటంలో బలిదానం చేయాలి.

రం:- ఔను బాబయ్యా! ఆనాడు స్వరాజ్యం వస్తుంది.

[రామన్న అమిత సంతోషాన్ని ప్రకటిస్తూ చేతులెత్తి, స్వరాజ్యం పుట్టుకతో జన్మించిన హక్కు! అని నటన చేస్తాడు.]

గం:- వస్తుంది! స్వరాజ్యం వస్తుంది! స్వరాజ్యం రాకమానదు. స్వరాజ్యం జాతికి జన్మహక్కు!

[భీమన్న వస్తాడు. భీమన్నముఖంలో సంతోషం చిందులు వేస్తూ వుంటుంది. రామన్న, భీమన్నను చూచినవెంటనే ఒక్క గెంతువేసి భీమన్నను సంతోషంతో చరుస్తాడు. భీమన్న మళ్ళా రామన్నను నవ్వుతూ కొట్టబోతాడు. రామన్న తప్పకొని బుంగమూతిపెట్టి కోపాన్ని నటిస్తాడు.]

భీమ:- బాబయ్యా! మీ ఆశీస్సులవల్ల జయం మనకు కలిగింది.

సీతా:- అంతా అమ్మగారి దయ.

[లోపలనుంచి, ఒకప్రక్కగా 'జై! అల్లూరి సీతారామరాజుకి జై!' అనే నినాదములు విన్పించును.]

భీమ:- అరుగో బాబయ్యా! ధర్మయుద్ధంలో విజయంబొందిన వీరులు!

[సీతారామరాజు ఆశబ్దములు వచ్చువైపుకు తిరిగి నమస్కరిస్తాడు, మరల, "జై! అల్లూరి సీతారామరాజుకీ జై! అనే నినాదములు విన్పించుచున్నవి.]

సీతా:- జై! భారతమాతాకీ!

[రంగస్థలంమీద నున్నవారూ, లోపలవున్న సైన్యమూ, ఒక్కమారుగా 'జై!' అని బదులు నినాదముల నిచ్చుదురు.]

భీమ:- మీ ఆశీస్సులు బొందిన యీ వీరులు 1000 తోటాలను, 63 తుపాకులను, 142 పెద్ద కత్తులను 3 గుఱ్ఱములను స్వాధీనము చేసుకొనినారు. స్వాధీనము చేసుకొన్న ఆయుధసంపత్తిని, అశ్వములను, దమనపల్లెలో యున్న మహిళాదండుకు అందజేసినాము. సీతమ్మతల్లి ఆయుధ సంపత్తినిచూచి ఎంతో సంబరపడ్డది.

గం:- ఆయుధములను అందుకొన్న సీతమ్మతల్లి యేమియూ చెప్పలేదా?

భీమ:- "వెయ్యి తోటాలతో వెయ్యిమంది తెల్లజాతి హింసాకారులు అంతమౌతారు. అంతేనా భీమన్నా!" అని ఆ తల్లి ఆనందపడ్డది.

[సీతారామరాజు ఆ మాటలకు ఎంతగానో సంతోషపడ్తుంటాడు. సీతారామరాజుని చూచి, రామన్నగూడా మురిసిపోతుంటాడు.]

సీతా:- వీరులారా! మీరు మీమీ గమ్యస్థానాలకు నిర్ణీత కాలానికి ఒక్క క్షణంగూడా ఆలస్యంలేకుండా చేరుకోనండి! ఒక్క అంబుకూడ తెల్లవాడిగుండెల చీల్చకుండా వృథా కాకూడదు. కాళెమ్మ దీవెనలతో కదలిపొండి!

[కోయిలంతా అక్కడున్న వారివారి ఆయుధములను తీసుకొని కాళెమ్మకు నమస్కరించి, అటుపిమ్మట సీతారామరాజుకు నమస్కరిస్తారు. గంగమ్మ 'ప్రోత్సాహగీతం' పాడుతూవుంటుంది. జయ

సూచనలు చేయు శంఖు, కొమ్ముశబ్దములు వెనుకనుంచి విన్పిస్తూవుంటవి. కోయలంతా యుద్ధమునకు బైలుదేరుతారు. సీతారామరాజు, గంగమ్మ మాత్రం సైన్యాన్ని చూస్తూ అక్కడే వుంటారు. రామన్న కూడా అక్కడే వుంటాడు. ]

ప్రోత్సాహగీతం.

పైపైకి దుమకండి
కొదమసింగములార
కదలండి కదలండి
తెనుగు వీరుల్లార
కదనరంగములోన
కత్తులనె ఝళిపించి
జయభేరి మ్రోగించు
స్వాతంత్ర సమరాన
తెనుగోడా! తెనుగోడా!

సీతా:- గంగమ్మా! మీ చిరంజీవిని జాగ్రత్తగా చూచుకో. నేను నిన్నటిరోజున చూపిన మూలికనే మరోపర్యాయం వుపయోగించండి. జ్వరం పూర్తిగా తగ్గిపోతుంది.

గం:- అలాగే బాబయ్యా!

సీతా:- దాచియున్న మందుగుండు సామగ్రిని జాగ్రత్తగా చూస్తుండు గంగమ్మా! సొరంగాలలో ఎలుగులు దిగ బ్రాకి మందుగుండుసామగ్రిని నాశనం చేయొచ్చు. వాటినీ కనిపెట్టు. వెళ్లివస్తా గంగమ్మా!

గం:- మంచిది బాబయ్యా!

[సీతారామరాజు కాళికమ్మకు నమస్కారం చేస్తాడు; అంబుల పొదిని ఎడమభుజమునకు తగిలించుకొనును. కత్తిని మొలలో దోపుకొనును. సీతారామరాజు యీ విధంగా యుద్ధానికి సన్నద్ధుడౌతున్న సమయంలో గంగమ్మ మాట్లాడ్తుంది.]

గం:- అమ్మా! భారతమాతా! తల్లీ! కాళికామాతా! మన్యానికి దేవతవైన ఓపట్టంపురాణీ! భుజబలపరాక్రమ ధైర్యసాహసోపేత అల్లూరి సీతారామరాజు, కంటికి కడివెడుగా కన్నీరుగార్చు భారతమాతనుజూచి, వ్యక్తిగత జీవితమునకు స్వస్తిజెప్పి, కనురెప్ప క్రిందకువాలు కాలమును కూడా విశ్రాంతికి గడపక, తెల్లజాతిని తరుముటకు నింగినీ మింటినీ ఏకము చేయుచున్నాడు. దుర్బలులు, గుండె బలములేని పిఱికిపందలు యీ ఋషిపుంగవుడు చేయు మహాయజ్ఞమునుంచి తప్పించుకొనుచున్నారు. ధైర్యవంతులు, శౌర్యశూరత్వము గలవారు యజ్ఞములో దుమికి యీ అఖండశిఖను ఆరిపోకుండా తమ రక్తాన్ని ఆహుతి చేస్తున్నారు. దీవించు తల్లీ! నాయకుని దీవించు! వెయ్యేండ్లు మాసీతారామరాజును బ్రతికించి, భారత దేశ భవిష్యత్తుకు చక్కటిచుక్కానిగా మాకు ప్రసాదించు తల్లీ!

[సీతారామరాజు అమ్మణ్ణికి నమస్కరించిన వెంటనే వెళ్లిపోతాడు. ప్రక్కనేవున్న మాగరామన్న అనుసరిస్తాడు. గంగమ్మ ఒకప్రక్కగా కట్టబడియున్న వుయ్యాలను రంగస్థలం మధ్యగా కట్టుంది. బిడ్డ వుయ్యాలలో నిద్రబోతూవుంటుంది. గంగమ్మ వుయ్యాల ప్రక్కనుండి 'కిశోర ప్రబోధగీతా'న్ని పాడ్తూవుంటుంది.]

కిశోర ప్రబోధగీతం

మేలుకో మేలుకో మేలుకోరా మేలుకో
నిదురబోవ్వా వేళకాదు

జోలనీకిది కాదుబాబు
చిట్టినాన్నా! జోలపాటకు
వేళకాదిది మేలుకో ॥ మేలుకో ॥

రవిబింబం పగిలిందీ
ఆకాశం విరిగిందీ
భూదేవీ కన్నెఱ్ఱచేసి

తనగుండెల నిప్పులచిందిందీ
భారతాంబ బంగారపుబిడ్డలంత
స్వాతంత్రపు యుద్ధభూమి కరిగేరు ॥ మేలుకో ॥

తెనుగుబిడ్డ నీవెకద!
యుద్ధభూమిరిపులతల
తెగనఱక కదలవర!
జోలపాట కిదివేళ!
తల్లిపాలు యిపుడేల! ॥ మేలుకో ॥

తెనుగుబిడ్డ నీవెరా
తొడనుగొట్టు వీరుడా
కదంత్రొక్కి కదలరా
కొండలనూ లోయలనూ
అన్నిటినీ అధిగమించి
జయభేరిని మ్రోగించి
వీరమాత పేరునాకు
దక్కనిమ్ము జోదుడా
తెనుగువీరుడా ॥ తెనుగు ॥

[పాట అయిపోతుంది. కవర్ట్ హైటర్లు వస్తారు. చేతులలో రైఫిల్స్, కత్తులు వుంటవి. గంగమ్మ వాండ్లనుచూచి ఒకప్రక్కగా నిల్చొంటుంది. దొరలు యిద్దరూ అటుయిటు తిరుగుచూ పరీక్షాదృష్టితో చూస్తారు. కానీ గంగమ్మమాత్రం తొణకదు. గంగమ్మ వీరవనిత. ఆమె తొణకదు వొణకదు. నిబ్బరంగా వుయ్యాలప్రక్కనే నిల్చొనుంటుంది.]

కవర్ట్:- నీవ్వూ ఎవరు?

గం:- ఈగూడెపు మనిషిని.

హైటర్:- ఓ! నీవు యీ గూడెపు మనిషివా! అవును! ఆ వ్రేలాడుచూ కన్పించుచూయున్న వస్తువు అదియేమిటి?

గం:- మీరువచ్చిన పనియేమిటి?

క:- ఓ! నీవు చాలా స్ట్రెయిట్‌గా మాటలాడుచున్నావే! చాలామంచిది.

హై:- వెరీగుడ్! ఈంతనైస్‌గా మాట్లాడే యిండియన్ లేడీ అబద్ధముకూడా చెప్పదనుకుంటాను.

క:- మీ అల్లూరి సీటారామరాజుగారు ఎచ్చటికి పోయి వున్నారో మాకు తెలియజేస్తారా?

గం:- అల్లూరి సీతారామరాజుగారా! నేనాపేరే వినలేదే!

హై:- ఏమి అమ్మా! నీకు వారిపేరు విన్పించక ఎట్లాపోతుంది! అల్లూరి సీటారామరాజుగారిపేరు మా లండన్ పట్టణంలో కూడా ప్రతిఒక్కరూ చెప్పుకొంటూ వుంటారు!

క:- మా రవిక్రుంగని బ్రిటిష్ సామ్రాజ్యములోకూడా అల్లూరి సీటారామరాజు పేరుచెప్తే, ఆ క్రుంగని సూర్యుడుకూడా కొద్దికొద్దిగా కొద్ది కొద్దిగా, క్రిందకు పడతాడు!

[ గంగమ్మ సంతోషంతో పెద్దగా నవ్వుతుంది. ]

హై:- వాట్ ! వై లాఫ్ ?

క:- ఏందుకునవ్వు ? నవ్వుతూ నైస్‌గా మాట్లాడే ఓ నాంగ-నాచీ !

హై:- కాలమును వృథాచేయక మేము అడిగిన ప్రశ్నకు సూటిగా సమాధానమును చెప్పుము ?

క:- నీవు సీటారామరాజుగారిపేరు వినకపోయిననూ వారిని చూచియున్నావా ?

హై:- చెప్పుము ?

గం:- యేమో ! నాకు తెలియదు.

హె:- ఏందుకని తెలియూదు. ఏమి అమ్మా ! అంతసన్నగా వుంకడూ; అంత లావుగా వుండడు ; మీ దేశానికి పేద్ద పేద్ద దేముడైన శ్రీరామచంద్రుడులాగా వుంటాడు.

గం:- ఎవరు ?

క:- మీ అల్లూరి సీటారామరాజుగారు మీ భారతదేశానికి పేద్ద పేద్ద దేముడైన శ్రీరామచంద్రునిలాగా వుంటాడు.

గం.- వారిప్పు డేమి చేస్తున్నారు?

క:- మా బ్రిటిష్‌వారితో యిాప్పుడు పేద్ద యూద్ధము చేయుచూన్నాడు.

గం:- తెల్లోడు కన్పిస్తే కండకుకండ చీలుస్తాడట! ఆయనేనా?

హై:- ఆ-వు-ను! ఆయనే! చెప్పు ? ఏక్కడకు పోయినాడు?

గం:- నేను వారిని చూడలేదు. వారిని తెలియదు. కాని తెల్లవాడితల నరికే మొనగాడని మాత్రం విన్నాను.

హై:- తెల్సినట్లుగా చాలాసేపు మాట్లాడి, మమ్ము(లను, మా నాలుకలచేతనే పేద్దపేద్ద తీట్లను పెట్టించి యిప్పుడు తేలియదంటావా?

క:- ఓహోవ్! యిండియన్సకు మాంచి యింటెలిజెన్స వుందని చెప్పేటందుకు నీవు ఒక్కదానివిచాలు, ఎగ్జాంపుల్!

హై:- కమాన్! నీ యింటెలిజెన్స్. నీ యిండియన్ యింటెలి జన్స్, మా గన్స్‌ముందు పనికిరాదు!

క:- ఈప్పుడు చేప్పు! మీ అల్లూరి సీటారామరాజు ఎక్కడికి పోయినాడు?

గం:- నాకు తెలియదు.

హై:- నీకు తెలియకపోయినచో, నీవల్లనే మేము ఆ కథనంతా చేప్పిస్తాము.

గం:- మీ కథ చెప్పేదానికే అల్లూరి సీతారామరాజు మహా నాయకుడు పోయివున్నాడు. మీ రదృష్టవంతులు. కవర్ట్ హైటర్ శవములను చూచుటకే మా సైన్యము పోయి వున్నది. కానీ తప్పించుకొని మీ రిక్కడ తిరుగుచున్నారు.

క:- ఓవ్! నీవు చాలా కరెక్ట్ మనిషివి. మాకొరకే మీ రాజు పోయివున్నాడు. అది కరెక్ట్. వెరీ కరెక్ట్.

హై:- కానీ యేక్కడికి పోయినాడు. ఏ పోలీస్ స్టేషన్‌ను [illegible]నమ్ము నాశనముచేయుటకు పోయివున్నాడు?

గం:- అది నే చెప్పను.

హై:- చాలా మర్యాదగా అడుగుచున్నాను. మర్యాదను బాగుగా రక్షించుకొని మేము అడిగిన, అడుగుచున్న, ప్రశ్నలకు చక్కగా చాలా మర్యాదగా జవాబులను చెప్పుము?

గం:- మర్యాదనుగురించి మాట్లాడే పెద్దమనిషీ! అసలు, మర్యాదనుగురించి నీకూ తెలుసా?

క:- ఓహ్! మాకూ తెలియదు! మాంచిమాంచి భవనములలో నివసించుచూ, గొప్పగొప్ప ఆహారమును తింటూ, పెద్ద పెద్ద చదువులను చదువుకొని, ప్రపంచమునకంతా ఆధిపత్యము వహించబోతున్న మా బ్రిటిష్ సొసైటీకి మర్యాదను గురించి తెలియదూ (వెటకారాన్ని సూచించేవిధంగా నవ్వుతాడు.]

హై:- కానీ, ఆకులూ, పచ్చికాయలు తింటూ, చెట్లక్రింద పుట్టలప్రక్కన బ్రతుకుతూ, బండలను, పెద్దపెద్ద చెట్లను, పాములు తిరుగుతూయుండే పుట్లను అనాగరికముగా దైవమని పూజించే, మీ యిండియన్సుకు మర్యాదను గురించి బాగుగా తెలియును! ;

క:- అని మాకు బాగుగా తెలియును.

గం:- ఛీ! అంతకూటికి గతిలేక, అడవుల్నూ, కొండల్నూ, సంద్రాలనూ దాటి, 'అలో' అంటూ అన్ని మెతుకుల కోసం నా దేశంలో ఎంగిలిబొచ్చెతో పి[illegible]ల్లా

తిరుగుచున్నారు. మేము తిని విసిరివేసిన ఎంగిలిఆకుల రుచి మరగి మా యింటి పంచల వదలలేకున్నవి యీ తెల్లజాతి మొరుగుడు కుక్కలు.

క:- నోరు చాలా పెద్దది చేసుకొంటున్నావు.

హై:- ముందుగా రాజవిషయమును చెప్పావు?

క:- చెప్పకపోయినచో నీకు తగినశిక్ష విధించబోవుచున్నాము.

గం:- బ్రతికుండగా మీకు మన్యంలోని మనిషి మర్మాలు తెలియచేయను.

హై:- పెద్దపెద్దమాటాల చెప్పవద్దు.

క:- ఉత్తపుత్త మాటలనుకూడా చెప్పవద్దు.

హై:- రాజుజాడను తెలియజేయక పోయినచో

క:- నీకు చాలా ప్రమాదము సంభవించును.

గం:- సంభవించునవి తమరు ముందుగనే సెలవిచ్చియున్నారు.

[కవర్ట్ తన చేతనున్న హంటర్‌తో గంగమ్మను ఒక దెబ్బ కొట్టాడు. గంగమ్మ ఆ దెబ్బకు భయపడదు; బాధపడదు. ఎప్పటిలానే నిల్చొనుంటుంది.]

హై:- ఇప్పుడు చెప్పు! మీ రాజు ఏక్కడికి పోయివున్నాడు.

గం:- తెల్లజాతిని భూస్థాపితం చేయడానికి.

క:- వాట్? భూస్థాపితమా!

హై:- తెలియచేయకపోయినచో [వుయ్యాలవైపు చూపెట్టుమా] నీ బిడ్డను యీ కత్తితో, యీ బ్రిటిష్ స్వోర్డ్‌తో నీ కండ్ల [redacted]నే కోసి చిన్న చిన్న తుంటాలు చేస్తాము.

క:- ఈ యిండియన్ చిన్నపాపాను కోసిన కండలను ఆ యిండియన్ జంగిల్‌లో తిరుగుచూవున్న కుక్కలకు నక్కలకు ఆహారముగా వేస్తాము.

హై:- చెప్పుము, మీ రాజు ఏక్కడున్నాడు? ఆంధ్రాటైగర్.

క:- [భయపడ్తూ] హాఁ! ఏక్కడ? వాట్?

హై:- వాట్ కవర్ట్? ఏమిటూ భయం! నో టైగర్!

క:- యస్! నో టైగర్. [ధైర్యమును తెచ్చుకొన్నట్లు షర్టుకాలర్ సర్దుకొంటాడు. గంగమ్మ హేళనగా నవ్వుతుంది.]

హై:- ఆంధ్రాటైగర్ మీ రాజుసంగాతి మాకు తెలియజేస్తే మీ బిడ్డను ముక్కలు ముక్కలుగా ఖండించము. నీ బిడ్డను రక్షిస్తాము. తొలుత నీవు కనిన నీ బిడ్డను జాగ్రత్తగా చూచుకొనుము.

క:- అటు తరువాత నీవు నీ దేశమును గురించి ఆలోచించుకొనవచ్చును.

హై:- దేశము ఎచ్చటికీపోదు; యిక్కడనే వుంటుంది.

క:- కాని ప్రశ్నకు జవాబు చెప్పకపోయినచో నీ ఆ ముద్దుబిడ్డ యిప్పుడే మీ యమలోకమునకు నేరుగా ప్రయాణమైపోవును.

గం:- నన్నెంత భయపెట్టిననూ నేనుమాత్రం మా రాజు సమాచారాన్ని మీకు తెలియచేయను. బిడ్డకోసం భయపడి కన్నతల్లికి ద్రోహం చేయదీ తెనుగుబిడ్డ. రాజు మా మన్యానికే దేముడు.

హై:- ఆ దేముడే యిప్పుడువచ్చి మీ బిడ్డను రక్షిస్తాడు. ఆ దేముడుని ప్రార్థన చేసుకో!

[కవర్ట్ తన చేతనున్న కత్తితో వుయ్యాలలోనున్న బిడ్డను పొడుస్తాడు. హైటర్ వుయ్యాలలాగి రంగస్థలంకు ఒకప్రక్కగా పారవేస్తాడు. వుయ్యాలగుడ్డ నెత్తురుముద్దయౌతుంది. రక్తం ప్రవాహంగా కారుతుంది. గంగమ్మ బిడ్డను రక్షించుకోనేటందులకు ఆఖరువరకూ ప్రయత్నం చేస్తూనేవుంటుంది. గంగమ్మ హృదయాంతరాళములు ఘోషిల్లునట్లు అరుస్తుంది. కవర్ట్ హైటర్లు వికటాట్టహాసం చేస్తూవుంటారు.]

హై:- చంపిన నీబిడ్డను, ఓ యిండియన్ లేడీ, యిదిగో చిన్న చిన్న ముక్కలుచేసి

క:- మీ జంగిల్‌లో తిరుగుచూవున్న జంతువులకు మాంచి ఆహారముగా వేయుచున్నాము.

హై:- భారతదేశ స్వాతంత్ర పోరాటంలో మీబిడ్డలు చాచ్చిపోయినా మీరుమాత్రం యీ ఫైట్‌ను నిలపేటాట్టులేరు.

[వికటాట్టహాసము చేయుచూ వెఱ్ఱిచిందులు త్రొక్కుచున్న కవర్ట్ హైటర్లు బిడ్డను విసరిపారవేసిన వైపుకు వెళ్లిపోతారు. విజయసూచకమో యన్నట్లు, కవర్ట్ తన చేతనున్న రివాల్వారును పైకి కాలుస్తాడు. బిడ్డపోయిన బాధతో గంగమ్మ కుమిలిపోతూవుంటుంది. కానీ కంటికి తడి పెట్టదు. ఆమె వీరనారి. ప్రతీకారంకోసం దెబ్బతిన్న ఆడుపులివలె తీవ్రంగా అటూయిటూ తిరుగుతూవుంటుంది. రివాల్వారు శబ్దం విన్నవాడివలె, సీతారామరాజు ఎక్కడనుండో పరుగెత్తుకుంటూ వస్తాడు. గంగమ్మ భయంకరముగా కన్పిస్తుంది. సీతారామరాజు తదేకదృష్టితో గంగమ్మవైపు చూస్తాడు. యేమీ అర్థంకాదు. అదిఒక అయోమయ అంధకార పరిస్థితి.]

సీతా:- [బిగ్గరగా] గంగమ్మా!

గం:- [బాధతోనే, కానీ బిగ్గరగానే] బాబయ్యా!

సీతా:- అమ్మా! గంగమ్మా!

గం:- అయ్యా! బాబయ్యా!

సీతా:- ఏమిటి చెప్పు గంగమ్మా! ఎందుకీ బాధ!

[వుయ్యాలవైపు చూస్తాడు. వుండవలసిన ప్రదేశంలో వుయ్యాల లేదు. దంగస్థలానికి ఒకప్రక్కగా క్రిందబడివుంటుంది. ఆవుయ్యాలను చేతికి తీసుకొంటాడు. ఆ గుడ్డంతా రక్తమయం. యింకా రక్తం కారుతూనే వుంటుంది.]

అబ్బా! ఏమిటీఘోరం! అమ్మా, గంగమ్మా!
నీ కడుపులో యీ కారుచిచ్చు పెట్టిన ఆ హంతకులెవరు?
పాలుగారే నీ చిన్నారికి యే దుర్మార్గుడు యీ అన్యాయం
చేసినాడు? తాకితే కందిపోవు నీ బిడ్డమీద యే దుర్మా
ర్గుడు కత్తిబెట్టినాడు? గుండెలలోదాచి, నీ ప్రాణములా
వేయికళ్లతో చూచుకొనుచున్న నీ బిడ్డను ఎవరు పొట్ట
బెట్టుకొన్నారు? కన్నులుగూడా తెరిచీ తెరవని యీ పాపను
యే కసాయివాడు బలిగొన్నాడు?

గం:- అబ్బ! బాబయ్యా!

సీతా:- చెప్పు గంగమ్మా! నవమాసములూ గర్భములో దాచి,
తన రక్తంతో ఆ శిశువును పోషించి, కని, ప్రాణముకన్నా
మిన్నగా చూచుకొను తన చిరంజీవిని మాతృమూర్తి
కన్నులఎదుటనే పొడిచి, ఆ కన్నతల్లి హృదయాంతరాళ
ములు సైతము, "బిడ్డా! నాయనా" "బిడ్డా! నాయనా!"

అని ఘోషించు మాతృహృదయము తెలియని ఆ నరజాతి హంతకుడెవడో చెప్పు? చెప్పుతల్లీ! చెప్పు! వాడిక్కడే కాదు,యీభూమిమీదయే మారుమూలలదాగియున్ననూ సరే, శోధించి, సాధించి, బంధించి వాడిని యీ కత్తితోనే ముక్కలు ముక్కలు గావించెదను.

గం:- బాబయ్యా!

సీతా:- భయమెందుకు గంగమ్మా! నీ బ్రతుకే ఎడారిచేసి, నీ నవ్వులపువ్వుల పందిరిపై నిప్పులచల్లి, నీ జీవనస్రవంతిని, నీ రక్తపుముద్దను, నీవు నిన్నఆశీర్వదించిన రేపటిస్వాతంత్ర సమర యోధుడ్ని ఎవరు తల్లీ చంపినది? కన్నులుగూడా తెరువని పసిగందు, తాకితే పాలుగారే పసిబుగ్గలు, గూడేనికే వేయిచుక్కలవెలుగు; అమ్మా, గంగమ్మా! ఎవరు చంపింది?

గం:-ఏదీ నా బిడ్డ! ఏదీ నా పాప! ఏమిటీరక్తం! ఏమిటీరక్తపు ముద్ద!

[పిచ్చిదానిలా యేడుస్తుంది. పిచ్చిదానిలా పెద్దగా నవ్వుతుంది. పిచ్చిదానిలా తల రేపుకొంటుంది. వుయ్యాలగుడ్డను హృదయమునకు హత్తుకొని, ఆ గుడ్డను ముఖమునకు దాచుకొని యేడుస్తుంది. ఒక్క క్షణం సీతారామరాజువైపు భావశూన్య చూపులతో చూస్తుంది. కనురెప్పపాటు కాలం అంతా నిశ్శబ్దం.]

సీతా:- [గద్గదకంఠముతో] అమ్మా! గంగమ్మా!

గం:- ఏదయ్యా బాబయ్యా నా బిడ్డ? 'అమ్మా!' అని నీ మధుర కంఠం నన్ను పిలిస్తే, ఆనందంతో పుప్పొంగిపోవాలని ఎంత

మురిసిపోయేను నాయనా! "బాబూ", "నాయనా" అని కడుపుపంటగా యింక నే బిడ్డను పిలిచేది! కడుపుపంట కడకు కడుపుమంటయైనదే భగవంతుడా! బాబూ! నా కన్నులఎదుటనే, నిన్ను కత్తులతో కండలుకండలుగా కోస్తే, నినుకన్న నీ తల్లి రక్షించుకోలేక పోయిందికదూ! నాయనా! బిడ్డను కన్నానేగాని బిడ్డను రక్షించుకోలేక పోయేనుగదూ! "బాబూ" అని నేనంటే, "అమ్మా" అని బదులుపల్కితే, నా హృదయం బృందావనమై నాట్యమాడి నిన్ను ముద్దుబెట్టుకోవాలనుకొన్నానే! బాబూ! ఎక్కడి బాబూ!

బాబయ్యా! నా బాబు పొయ్యేడు! నా చిట్టితండ్రి పొయ్యేడు! నాకు బిడ్డ లేడు! బాబూ, నాకు బిడ్డ లేడు!

[భీమన్న, మల్లురాజు, మూగరామన్న మరికొంతమంది కోయ సైనికులతో వస్తారు. స్టేషన్లను కొల్లగొట్టి తెచ్చిన ఆయుధములను ఒక ప్రక్కగా పడవేస్తారు. గంగమ్మ యేడుపుకు అర్థం తెలియక కోయలంతా గుడ్లప్పగిస్తూ చూస్తారు. గంగమ్మ వాండ్లదగ్గరకు వస్తుంది.]

మామా! రంగమామా! మనబాబు చచ్చి పొయ్యేడు. 'నాయనా!' 'నాయనా' అని నీవు పిలిచే మనబిడ్డ చనిపోయేడు. నీవు చంపాలనుకున్న కవర్టు హైటర్లే మనబాబును చంపేరు. నా కళ్ళఎదుటే, తల్లి ప్రాంగణంలోనే, తనుకన్న సంతతిని బ్రిటిష్ హంతకులు చంపేరు రంగమామా! మామా!

ఏడీ నా మామ! నా మామ యేడి! చెప్పండయ్యా! భీమన్నా! నామామ యేమైనాడు? అయ్యా! ఒక్కరూ [illegible]లుక

రేమి? మల్లూ! నీవూ చెప్పవా? రామన్నా! చెప్పునాయనా! నామామ యేమైనాడు! "నిన్ను ఎప్పుడూ వదలిపోను! నీవు చుక్కవైతే నేను చంద్రుడ్ని, నేను వెలుగునైతే, నీవు నా ఛాయవు" అని ఎన్నోమాటలు చెప్పి నన్ను మురిపించి నమ్మించిపోయిన నా మామ యేడి? రామన్నా! పలుకవేమి రామన్నా! మూగరాముడూ! నీవూ చెప్పవా? [సీతారామ వైపు చూస్తూ] బాబయ్యా! ఏడీ నా రంగమామ? చెప్పండి! ఎప్పుడొస్తాడు? ఏం! ఒక్కరూ పలుకరేం?

భీమ:- అమ్మా!

గం:- చెప్పు భీమన్నా! త్వరగా చెప్పు!

భీమన్న:- దమనపల్లె పోరులో రంగన్న చూపిన పరాక్రమం విప్లవవీరుల రక్తచరిత్రకు మరియొక సువర్ణ కంఠాభరణం!

గం:- [సంతోషంతో] అబ్బా! ఎంత సంతోషవార్త చెప్పేవు భీమన్నా! నీకు నమస్కారం! [కనుకొలుకులలోని కన్నీరు తుడుచుకొంటుంది.]

భీమ:- ప్రళయకాలరుద్రుడై, అన్యాయాలకు, అక్రమాలకు, యీనాడు ఆటపట్టైన పోలీస్ స్టేషన్‌ను దోచి కనురెప్ప పాటు కాలములో ఒక్క వంద మరతుపాకులను, వెయ్యి తోటాలను వశం చేసుకొన్నాడు!

గం:- నా మామ వీరుడు! దమనపల్లె దేశభక్తులు నా మామకు యింకా వీరోత్సవాలు జరుపుతూనే వున్నారు కాబోలు!

మల్లు:- అమ్మా! గంగమ్మా!

గం:- ఔనుమల్లూ! అప్పుడే మీ రెండుకొచ్చేరు? అంతా ఒక్కటిగానే రాకూడదూ! ఔనులే! శుభవార్త చెప్పి మమ్ముల సంతోషపరుచుటకు తొందరతో వచ్చివుంటారులే!

భీమ:- గంగమ్మా! అదికాదమ్మా!

గం:- ఔను! అదీ నిజమే! భర్త విజయోత్సవాలలో కెరట మెత్తు గర్వంతో పొంగిపోతుంటే, ఆ గర్వపుపొంగులో ఆనందపునురుగు నేనూ పంచుకోవాలిగా! నాభర్తకు దమన పల్లెప్రజలు 'జేజేలు' పల్కుతూంటే నే చూచి మురిసి పోవాలని నన్ను పిల్చేందుకు వచ్చేరుకదూ! ఆః! పదండి! బాబయ్యా! వెళ్ళివస్తా! వీరతిలకం దిద్దాలిగా! తలనిండా పూలు పెట్టుకొంటా! పెద్ద కుంకుమబొట్టు నుదుట పెట్టు కొంటా! చేతినిండా గాజులు తొడుక్కొంటా! నా భర్తకు కన్పిస్తా! 'గంగా!' అని అంతమందిలో నన్ను పిలుస్తాడు! అబ్బ! ఎంత అదృష్టవంతురాల్ని మామా నేను!

కానీ, 'బాబు...మనబాబును తీసుకొనిరాలేదు వేఁమి' అని అడిగితే ఏం జవాబు చెప్పేది! మామ కోప్పడుతాడేమో! ఏం మల్లూ "బాబు" కేమైనా చెప్ప మన్నాడా! బాబుసంగతి ఎట్లా చెప్పేది మామతో!

మల్లు:- అమ్మా!

గం:- ఏమి మల్లూ?

మల్లు:- రంగన్న...

గం:- ఆ... చెప్పు! సంకోచమెందుకు సంతోషవార్త చెప్పేటందుకు?

మల్లు:- అమ్మా! [మల్లు చెప్పలేక భీమన్నవైపు చూస్తాడు. భీమన్న చెప్తాడు.]

భీమ:- రంగన్న లోపలనుంచీ, నేను వెలుపలనుంచీ పోరుసలిపినాము. రంగన్నను ఎదిరించుటకే భయపడ్డదా సైన్యము.

గం:- ఆఁ!

భీమ:- యింతలో మలబారుసైన్యము విరచుకబడ్డది. ఆ పశువులు రంగన్నను చుట్టుముట్టినవి. నేను వెలుపలనుంచీ, రంగన్న లోపలనుంచీ పోరుసల్పినాము. తప్పించుకొనేదానికే పోరాటంగాని, భారతీయులైన బ్రిటిష్ సైనికులఒక్క రక్తపు బిందువైనాసరే భూమిమీద చిందకూడదని రాజు వుత్తరువాయె! అదురుదెబ్బలతోనే, విరచుకబడే విచక్షణ లేని ఆ సైన్యముతో ఎంతసేపని పోట్లాడుతాం! అప్పటికే రంగన్న ఒంటినిండా గాయాలు!

గం:- ఆఁ! నా ముఖమున కవి మచ్చలు!

భీమ:- మహావృక్షం కూలినట్లు, రవిబింబం క్రుంగినట్లు ఆ మహావీరుడు క్రిందబడ్డాడు.

గం:- అబ్బా! నా ఆశలు కూలిపోయినవి!

భీమ:- రంగన్న చనిపోయేడు. అమ్మా! రంగన్న చనిపోయేడు. రంగన్న బలిదానపుచరిత్ర రక్తాక్షరాలతో వ్రాస్తారు.

గం:- ఆఁ! [పెద్దగా] మామా! రంగమామా! సీతారామరాజు వైపు చూస్తూ]

బాబయ్యా! ఏమిటీ అన్యాయం [ముఖానికి బొట్టు తుడుచుకుంటుంది.]

ఏమయ్యా! ఏమిటీ దురంతం [తలలోని పూలనులాగి క్రింద పారేస్తుంది.]

ఓ రాజూ! సీతమరాజూ! విప్లవవీరుల మహా నాయకా! ఏమిటీ వల్ల కాదు? [చేతి గాజులు విరగ్గొట్టుకొంటుంది.]

అయ్యా! భారత దేశోద్ధారకా! చివరకు నాకు, 'నాది' అని మిగిలింది యేదీ లేదా [మాంగళ్యసూత్రాన్ని త్రెంచి కళ్ళకు అద్దుకొని నెమ్మదిగా క్రింద పారేస్తుంది. సీతారామరాజు కంటికి తడి తగిలింది.]

సీతా:- అమ్మా!...

గం:- బాబూ! చితికిపోయిన మనస్సు ఏమేమో మాట్లాడింది! మన్నించు బాబూ!

అయ్యా! ఎవరు హంతకులు? హంతకు లెవరు? ఏమిటీ పరాయిపాలకుల అత్యాచారం! ఎందుకీ హత్యా కాండలు! ఎందుకీ రక్తపు మడుగులు!

నా బిడ్డ .. ముక్కుపచ్చలారని నా బిడ్డ బ్రిటిష్ ఘాతకుల కత్తులకు నిర్దాక్షిణ్యంగా నా కండ్లఎదుటే బలి ఐపోయేడు. బాబయ్యా! నే నెందుకు బ్రతకాలి? నా ఆశా జ్యోతి ఆరిపోయినది! నా జీవితచుక్కాని విరిగిపోయినది!

ఇంటిలో చీకటి! ఈ దేశంలో చీకటి! అంతా చీకటే! చుట్టూరా చీకటే! నా భర్త...నా బిడ్డ...నా బిడ్డ...యీ స్వాతంత్ర్య పోరాటాగ్నులలో సమిధలైనారు! మిగిలిందల్లా నేనొక్కదాన్నే! నేనూ బలికావాలి. బాబయ్యా! నా కుటుంబాన్ని హత్యచేసిన ఆదుర్మార్గులను అంతం చెయ్యాలి! ఆశీర్వదించండి బాబయ్యా; ఆశీర్వదించండి. నేనూ పోరాడుతాను.

సీతా:– అమ్మా! గంగమ్మా! యీ పితూరీ సామాన్యమైనది కాదు. నిప్పులు చెలరేగే అగ్నిగుండం. నీతియంటే యేమిటో తెలియని తెల్లజాతి కిరాతకులు, పశువులకన్నా హీనంగా ప్రవర్తిస్తున్నారు. నీవు పోవొద్దు. నీ బిడ్డనూ, నీ భర్తనూ చంపిన ఆ హంతకుల రక్తం, నీ కాళ్ళకుముందర క్రుమ్మరిస్తాను.

గం:– నేను చంపాలి! నా గుండెల్లోని పొగలు అప్పటిగ్గాని చల్లారవు. ఆడదానినని అడ్డగించవొద్దు. ఈ శరీరంలో, వీరవనిత ఝాన్సీ, మగువ మాంచాలీ కవోష్ణరక్తం ప్రవహిస్తూ వుంది. తెనుగునాట ఆడబడుచు, అవసరమైతే యుద్ధభూమిలో నిప్పులచిందించే కాళికామాత యౌతుంది.

సీతా:– అమ్మా! గంగమ్మా!

గం:– ఆపొద్దు బాబయ్యా! నే పోతా! ఏదీ ఖడ్గం! ఏదీ అంబుల పొది! బ్రిటిష్‌పశువులను నా భర్త వధించిన ఆ ఖడ్గం యేదీ! ఆ ఖడ్గపురక్తం ఆరిపోకమునుపే, తడితోనే నా భర్తను చంపిన ఆ మూకను చిత్రహింసలు చేయాలి.

వారే! అవిగో, కవర్ట్ హైటర్ పశువులు! నే పోతా, చంపనిదే తిరిగిరాను! ఇది నా కాళికామాత యాన! ఇది నా నాయకుడు, సీతారామరాజు సాక్షి! నేను చంపనిదే తిరిగిరాను. నా బిడ్డను ఎవరిచేతులైతే హత్య చేసినవో, ఆ హంతకులచేతులు నేల రాలనిదే నే తిరిగి రాను. నా భర్తనుచంపి నా కన్యాయంచేసిన రాక్షస మూక రక్తప్రవాహం, వీధులవెంబడి దుమ్ములో ప్రవహించనంతవరకు నాకు విశ్రాంతి వుండదు. వస్తా! నే పోతా. నే బ్రతకను! రాక్షసుల చంపనిదే నే బ్రతకను! నాస్థానం యుద్ధభూమి! అదిగో జయభేరి! అదిగో, అల్లదిగో శంఖారావం! వినరాదా పాంచజన్యం! రిపుభయానక త్రినేత్ర ఢమురకనాదం అల్లదిగో! నేనిక వుండ లేను!

[గంగమ్మ పోబోతుంది. కోయలంతా అడ్డువస్తారు.]

నా కడ్డం లేవండి! నా క్రోధకు అడ్డంవొద్దు. ఉప్పెనతో వుప్పొంగిపోయి, ఆకాశమంతఎత్తు ఎగురు భీకర ఘోషణ ప్రళయకాల ఝంఝామారుత మహోజలధులకు ఆనకట్టలు కట్టవొద్దు. పోతున్నా! నే పోతున్నా!

మల్లు:- ఇదేనమ్మా నీ భర్త వీరఖడ్గం.

[వీరఖడ్గాన్ని అందిస్తారు. రక్తం, ఖడ్గపు అంచుల నిండా కన్పిస్తూనే వుంటుంది. సంతోషంతో ఆకత్తి నందుకొంటుంది. దూరమునుంచే కాళికామాతకు నమస్కారం చేస్తుంది, అటుపిమ్మట సీతారామరాజుకు, కోయలకు నమస్కరిస్తుంది, 'భీభత్సమే' ఒక ఆకృతిని కలిగి కదిలినట్లుగా గంగమ్మ వెళ్ళిపోతుంది.]

సీతా:- మీలోని మహావీరులు ఆమెకు బిడ్డలై, ఆమె జరుపు ధర్మయుద్ధంలో సేనానులు కండి. మీ ప్రాణముల పణముగా అడ్డుపెట్టి ఆమె ప్రాణముల కాపాడండి. ఆమెను కాపాడండి. నిద్రాహారములమాని ఆమెను అనుసరించండి.

[భీమన్న మరికొంతమంది కోయలతో వెళ్ళిపోతాడు.]

మల్లు:- బాబయ్యా!

సీతా:- మల్లన్నా! సింగన్న సంగతి తెలియనే లేదు. పోయి తెలిసికొని రావయ్యా!

మల్లు:- అలాగే బాబయ్యా!

సీతా:- రామన్నా! రాజవొమ్మంగికి పోయి, రాత్రి పోరు సంగతి తెలుసుకొనిరా!

[రామన్న వెళ్ళిపోతాడు. సీతారామరాజు అటూయిటూ తిరుగుతూ వుంటాడు.]

అమ్మా! జగన్మాతా! ఏమిటమ్మా యీ దారుణం! నా జన్మభూమిపై యీ పరాయివాని కసాయీ పరిపాలన యింకా ఎంతకాలమమ్మా! ఈ దేశంలో మనిషికొక్క సిద్ధాంతం, గ్రామానికొక్క పార్టీ. ఏ రెండుతలలూ ఒక్క చోటుకు చేరవు. కానీ, జన్మభూమి పోరాటంలో, జన్మ హక్కుకోసం నా మన్యపు సోదరులంతా ఒక్కటైనారు. ఇదేవిధంగా నా దేశంలోని ప్రతి పల్లెసీమ ఒక్కొక్క పితూరీ దళమైతే, ఒక్కొక్క గ్రామానికి ఒక్కొక్క తెల్లజాతి బలిపశువుకూడా దొరకదు.

[మల్లన్న ప్రవేశిస్తాడు]

మల్లు:- సింగన్న రూపే మారిపోయింది బాబయ్యా!

సీతా:- [ఆతృతతో] ఏమటిమల్లూ!

మల్లు:- సింగన్న శుష్కించి, ఎముకులగూడై, ఒకశవమై స్వాతంత్రపోరాటంలో సమసిపోయిన స్వచ్ఛంద దేశభక్తుల సమాధులచెంత కూర్చొని కాలాన్నీ, దేశాన్నీ అన్నిటినీ అధిగమించి అనంతశూన్యరోదసీ కుహరగీతము నాలాపించుచున్నాడు.

[ఒక్క క్షణకాలం, ఎచ్చటినుంచో భయముగొల్పు సంగీతము, ఒళ్ళు ముచ్చెమటలుపోయి భయంకరశబ్దములు, పిచ్చిపిచ్చి పెద్దనవ్వులు వినిపించును. సీతారామరాజు, మల్లన్న జాలితో ఏమియూ చేయలేని అసహాయస్థితిలో వుంటారు. అటుతర్వాత క్రిందిపాట వినిపిస్తుంది. మధ్యమధ్య సీతారామరాజు మాట్లాడుతూ వుంటాడు.]

ఉన్మాదుని సంగీతం

[లోపలనుంచి సింగన్న]

సీతారామరాజూ ఓ ఓ ఓ సీతారామరాజూ

[పెద్దగా యేడుపు—శోకమే జాలువారి సంగీత స్వరూపమౌతుంది]

సీతారామరాజూ ఓ ఓ ఓ సీతారామరాజూ

[పెద్దగా వెఱ్ఱినవ్వు—నవ్వే, కొండలమీదినుంచి దుముకు సెలయేటి గమనాన్ని పొందుతుంది.]

సీతా:- [పెద్దగా] సింగన్నా! నీ తల్లి దీనస్థితినిచూచి తుదకు పిచ్చివాడవయ్యావా? ఔను! నీ మేధస్సులో కోటికోట్ల స్వచ్ఛంద దేశభక్తుల హృదయములున్నవి! పిచ్చివాడవు కాక యేమౌతావు?

ఉన్మాదుని సంగీతం

[లోపలనుంచి సింగన్న]

ఏది పిచ్చి? ఏది మంచిది?
పిచ్చి మంచిది! మంచి పిచ్చిది!
పిచ్చివాడు! మంచివాడు!
మంచివాడు! పిచ్చివాడు!
వున్నదేదీ తెలియదూ!
జరుగుచున్నది తెలియదూ!
బాధలేదూ! గాధలేదూ!
గాధలేనిదె బాధలేదూ
బాధలేనిదె గాధలేదూ
వస్తా నే పోతా
పోతా నే వస్తా
సీతరామరాజూ
నా సీతమరాజూ

[పెద్దగా నవ్వుతూ పాట ముగిసిపోతుంది]

సీతా:- అహోరాత్రులూ శ్రమించి, మన్యపుసోదరుల నైక్య పరచి, యీ పితూరీకి పునాదిరాయిగా నిలబడ్డ సింగన్న వున్మాదుడయ్యేడా! ఈ చావుల్నీ, రక్తపుమడుగుల్నీ చూచి హృదయమున్నవాడు కాబట్టి పిచ్చివాడయ్యేడు.

మల్లు:- బాబయ్యా! మరోవార్త.

సీతా:- ఏమిటా వార్త! ఏదైనా ఏమిలే చెప్పు! తుఫానులో మందమారుతవీచికలు వీయవులే! చెప్పు మల్లూ!

మల్లు:- మన్యంలోని దట్టమైన అడివినంతా నేలచదరం చేస్తున్నారు. గొల్లా పోరాటానికి వీలుగానున్న గుబురు పొదల నన్నిటినీ నరికిపారేస్తున్నారు. ఎవరో ఒక జమీం దారట! మన పోరాటాన్ని అణగద్రొక్కేదానికి బ్రిటిష్ వాండ్లకు ఏనుగులు పంపినాడు. దుమ్ముగూడెంలోని ప్రతి యింటినీ మత్తెక్కిన ఆ యేనుగులు భీభత్సం చేసినవి!

సీతా.. ఆఁ!

మల్లు:- ఎందరో, ఎందరో ఆ ఏనుగుల యినుపపాదములక్రింద బడి కూలిపోయేరు

సీతా:- అబ్బా!

మల్లు:- భయంకరం! అంతా రక్తమయం! తల్లికోసం బిడ్డ యేడ్పు! బిడ్డకోసం తల్లిశోకం! అదిఅంతా ఒక నరకమై పోయింది బాబయ్యా!

సీతా:- స్వాతంత్రపోరాటానికి మొదటి అడ్డంకు జమీందార్లు గానీ, జాగీర్దార్లుగానీ, జన్మభూమి విముక్తి పోరాటానికి ఎదురు నిల్చువాడు దేశద్రోహి. కానీ యీ సీతారామ రాజు తోడి సోదరులమీందకి కత్తిని దూయలేడే! భార తీయులందరూ ఒక్క త్రాటిపై నిలచినచో ముష్టి యీ తెల్లకోతుల ప్రభుత్వం ఒక్కక్షణములో ఎగిరిపోవును. కానీ...

మల్లు:- బాబయ్యా! శెలవ్!

సీతా:-మల్లూ! కన్నతల్లి సంకెళ్లనుచూచి అహోరాత్రులూ కంటతడిబెట్టి, రేపు రానున్న స్వాతంత్ర్యానికి, యీ దినం పునాదిగా పనిచేస్తున్న సీతను ఒక్కసారి తీసుకోవిరా! రేపు నేనే యుద్ధభూమిలో జయభేరి ప్రమోగిస్తాను. పితూరీ దళ రహస్యాలను ఆమెకు కొన్ని చెప్పాలి! అత్యవసరం!

మల్లు:- సరే బాబయ్యా! [వెళ్ళిపోతాడు]

సీతా:- సీత ఒక మహా నాయకురాలు! ఆమె స్వాతంత్ర పోరాట ధ్రువతార! ఆమె, యీ పోరాటములో చేయు సాయము మరిపురానిది. అసంఖ్యాక దేశభక్తుల బలి దానపు ఫలితమే రేపు రానున్నతరం అనుభవించు స్వాతంత్రం. హక్కును బిచ్చమెత్తిసంపాదిస్తే అది దొరికేదీ కాదు; పద్ధతీకాదు. కండబలంతో గుండెధైర్యంతో, రక్త తర్పణతో సాధించాల్సింది స్వాతంత్రం. యే ఒక్కమనిషి, యే ఒక్కపార్టీ, పోరాడితే వచ్చేది కాదు స్వాతంత్ర్యం. నలుబదిమూడుకోట్ల భారతీయులూ సైనికులు కావలసిన దే యీ మహాభారతయుద్ధంలో. రేపటి స్వాతంత్రపు అను భవములో ప్రతి భారతీయుడూ పరిపూర్ణ వారసుడే!

[రామన్న ప్రవేశం—గగ్గోలుగా అరుపులు—పితూరీదళం దెబ్బ తిన్నదని నటన—బాధతో కూడిన అరుపులు—సీతారామరాజుని బైటకు పోవొద్దని ప్రార్థనాపూర్వకమైన గోడు.]

సీతా:- రామన్నా!

రామ:-హా! హా! హా! హా! [యేడుపుతో అరుపులు]

సీతా:- రాత్రిపోరులో మనసైన్యం దెబ్బతిన్నదా?

రామ – హాఁ! హాఁ! హాఁ! భోఁ! భోఁ! భోఁ! హాఁ! [ప్రమాదమని సూచన]

సీతా.– అబ్బా! పితూరీకి తుఫాను ఎదురైనదా?

రామ:– హాఁ! హాఁ! హాఁ! [మనవారు చాలామంది చనిపోయేరని నటన]

సీతా:– యుద్ధంలో అశేష భారత ప్రజానీకం నేల కొరిగిందా?

రామ:– హాఁ! హాఁ! భోఁ! భోఁ హాఁ హాఁ! [చనిపోతున్నా స్వచ్ఛంద దేశభక్తులు యుద్ధానికి యింకా సాగివస్తున్నారని సంతోషముతో నటన]

సీతా:–నేల కొరిగిపోతున్నా యింకా భారతీయులు యుద్ధంలో దూకుతూనే వుంటున్నా రంటున్నావా! అవును! ఇది భారతిగడ్డ! శ్రీరామచంద్రునికన్న భూమి! పరశురాముని యిట ప్రతియంగుళము నడిపించి గడ్డిపోచకు సైతము గుండెధైర్యమును నూరిపోయించిన వీరగడ్డయిది. యిది పితూరీకిజాతి కాదు. పాలతో పౌరుషాన్ని నూరిపోయించు కొన్న వీరజాతి! పదిమాసములు తక్కువైనా, పుట్టితే యీ పవిత్ర భూమిమీదనే పుట్టాలి! సూర్యుడు యిక్కడ వుదయిస్తాడు. నా గడ్డమీద విజ్ఞానం తొలిసారిగా వికసించింది. ఈ గడ్డమీద పుట్టుటయన్న అది వేయిజన్మల నోము. స్త్రీలుసైతము పౌరుషము నొలికించు వీరజాతి నా జాతి!

[భీమన్న ప్రవేశిస్తాడు. ముఖంలో సంతోషం.]

భీమ:– సంతోషవార్త బాబయ్యా!

సీతా:- చెప్పు భీమన్నా!

భీమ:- గంగమ్మ, కవర్ట్ హైటర్లను ఒకేఒక కత్తిదెబ్బతో తుంటలుతుంటలు చేసింది.

సీతా:- [సంతోషభరితుడై] అమ్మా! గంగమ్మా! ధన్యజీవి వమ్మా! పట్టినశపథాన్ని నెరవేర్చి తెనుగుదేశపు పేరు నిలబెట్టేవు.

[రామన్న సంతోషంతో పొంగిపోతూ వుంటాడు.]

భీమ:- ఆ యుద్ధభూమిలో ఆ శవాలను రూథర్ కాళ్ళఎదుట ఎగురవేయమని పిడుగులుపడినట్లు అరిచినది! రూథర్ కాళ్ళఎదుటనే మేమా శవాలను పారవేసినాము.

[గంగమ్మ వస్తుంది. శరీరమంతా రక్తం. ఆమె ఒక భయానక స్వరూపం. ఒళ్ళంతా గాయాలు. రేగినజుట్టు. శరీరమంతా రక్తం. మరణ బాధ.]

సీతా:-[బాధతోనే, పెద్దగా] అమ్మా!గంగమ్మా! ఎంత అన్యాయం జరిగించితల్లీ! ఏ దుర్మార్గుడు ఆడదానిని తుపాకులతో కాల్చినాడు. మరణబాధగదూ తల్లీ! అమ్మా! వీర మాతా! నీకుటుంబమంతా యీ పోరాటానికి అంకితమా తల్లీ!

గం:- బాబయ్యా! నేనేకాదు; యీ తల్లిగన్న ప్రతిస్త్రీకూడా వీరావేశం పొందాలి. బ్రిటిష్‌జాతి దౌర్జన్యం హద్దులు దాటింది. పాలుగారే చిన్నారిపాపల్ను మదపుటేనుగుల చేత త్రొక్కిస్తున్నారు. కన్నతల్లి కన్నులఎదుటనే, బిడ్డలను

కత్తులతో పొడిచి రక్తాన్ని ఎగచల్లుతున్నారు. అబ్బా అబ్బా... భారతస్త్రీ నేటిగతి... అబ్బా...

సీతా:-అమ్మా! యేమిటమ్మా యీ ప్రళయం! భగవంతుడా! ఎంతకాల మీ అగ్నిపరీక్ష! తెల్లజాతి నీతిలేని కోతిరాజ్యం యింకా ఎంతకాలము! మన్యపు సోదరులారా! మీరు నా దేశపు గారాబుపంట. కన్నతల్లికోసం, కునుకైనా లేకుండా కాలమంతా జన్మభూమివిముక్తికోసం త్యాగంచేస్తున్నారు. అమ్మా! గంగమ్మా! మీ మన్యపుచరిత్ర, భారతదేశ స్వాతంత్రపోరాట చరిత్రలో ఒక విప్లవతేజస్సు. ఇదే విధంగా...

గం:-నాదేశంలోని ప్రతిసోదరీ యీ తరుణంలో నడుంకట్టాలి. హత్యకు హత్యే ప్రతీకారం. కత్తిని కత్తితోనే దెబ్బకొట్టాలి. హంతకులకు శిక్ష తలనరకటమే! హంతకులను వదలకూడదు. తల్లుల్లారా! ఈ విపత్కర పరిస్థితుల్లో, మనలనుకన్న జన్మభూమి పోరాటంలో మీరూ కదలండి. నడుంకట్టి కదలండి. మీ సోదరులతో భుజంభుజం కలపండి. రణరంగమంతా శత్రుమూక రక్తంతో తడపండి. శత్రుమూక శవములు, శత్రుమూక రక్తములోనే తేలి, సముద్రములద్వారా సాగనంపి లండన్ నగరవీధుల్ని శవములతో నింపండి. అధికార దుర్మదాంధ తెల్లజాతి కిరాతకులకు అప్పుడుగాని కండ్లు మూతలు విప్పవు. అమ్మా! బాబయ్యా! రంగమామా! నా ..చిట్టినాన్నా! నా...

దేశం... యీ తెల్లజాతి వుండకూడదు! వందే మాతరం! వందేమాతరం!

[గంగమ్మ చనిపోతుంది. సీతారామరాజు కనుకొలుకుల్లో కన్నీరు గూడుకట్టుకొంటుంది. ఒక్క క్షణం భావశూన్యచూపులతో ఆకాశం వైపు చూస్తాడు; మరియొక్క క్షణం జాలిగా కాళికామ్మవారివైపు చూస్తాడు; యింకొక్క క్షణం వెట్టిగా గంగమ్మ శవంవైపు చూస్తాడు.]

సీతా:- [గద్గదస్వరముతో] సోదరులారా! గంగమ్మతల్లిని వీరమాత మర్యాదలతో సాగనంపండి. అమ్మా! గంగమ్మా! నీ జీవితచరిత్ర మా విప్లవరథానికి సింధూరం బూసింది.

[రామన్న ఒకవైపు, భీమన్న మరియొకవైపు గంగమ్మ శవమును ఎత్తుకొని తిన్నగా పోతారు. మిగతా కోయిలు ప్రక్కనే పోతారు. నేపథ్యంలోనుంచి పాట విన్పిస్తుంది.]

వీరపూజాగీతం

స్వాతంత్రపోరాట బలిదాన సమిధవై
రక్తాన్నె అర్చనగ ధారబోసేవా
తనువునే పూవుగా నేలరాల్చేవా
నీ జన్మమేతల్లి ధన్యమోయమ్మ
వీరస్వర్గము నీదె ఓ వీరమాత
ధన్యోస్మి! ధన్యోస్మి! ఓ దేశభక్తా!
ధన్యోస్మి! ధన్యోస్మి! ఓ వీరమాతా!

సీతా:- గంగమ్మజీవితం భారత ప్రజావళికి వందనీయమైన సుప్రభాతం.

[మల్లు పరుగెత్తుకుంటూ వస్తాడు. మనిషిలో ఏదో చెప్ప నలవికాని బాధ వ్యక్తమౌతూవుంటుంది. ఆవేశం ముఖంలో కన్పిస్తుంది. కానీ చెప్పాలనుకొన్నది చెప్పలేక పోతున్నాడు.]

సీతా:- ఏమిటా ఆవేదన? ఎందుకా ఆవేశం? చెప్పు మల్లూ; చెప్పు.

మల్లు:- బాబయ్యా! పరిస్థితులు మారిపొయ్యేయి. రాజు జాడను తెలియజేస్తే రూపాయలను క్రుమ్మరిస్తారట. రాజు జాడను తెలియచేయకపోతే రక్తాన్నే రుచిచూస్తారట. బాబూ! మన్యమంతా శ్మశానమైంది. ఎక్కడచూచినా వీరుల రక్తపుమడుగులే!

సీతా:- అమ్మా! భారతమాతా! ఏమిటమ్మా నీ సంకల్పం! పలుకవేమితల్లీ! నీ ఆశీస్సులు మాకులేవా? నీకోసం తల పెట్టిన యీ పోరాటానికి విఘ్నాలెందుకుతల్లీ! అమ్మా! ఏమిటమ్మా యీ హత్యలు! ఏమిటమ్మా నీ బిడ్డల శవాల కుప్పలు! ఇదినీకు న్యాయమా అమ్మా!

మల్లు:- బాబయ్యా!

సీతా:- ఏం మల్లూ!

మల్లు:- బాబయ్యా! [ చెప్పాలనుకున్న సంగతి చెప్పలేక బాధతో క్రుంగిపోతూంటాడు. ]

సీతా:- మల్లూ! యేమిటో చెప్పు? ఎందుకు సంకోచిస్తావు? చెప్పుమల్లూ! ఏమిటో చెప్పు?

మల్లు:- బా...బ...య్యా! సీతమ్మతల్లి చనిపోయింది!

సీతా:- నా హృదయం పగిలింది!

మల్లు:- తను చనిపోతూ మిమ్ములను బ్రతకమని ఆశీర్వదించినది.

సీతా:- స్వచ్ఛంద దేశభక్తురాలు! అకుంఠిత దీక్షాకంకణధారి! తెనుగుతల్లి ప్రియతమ సంతానము! తెనుగు దేశపు విప్లవ పోరాటానికి రక్తాక్షరాలు చల్లి నాందీవచనాలు బల్కిన వీరనారి! తెనుగుఆడబడుచుల ఆరాధ్యదైవము!

తొలినుంచీ తుదిదాకా తూర్పుదిక్కున ఆవరించుకొనియున్న అంధకార వాతావరణాన్ని చూచి అహోరాత్రులూ కుమిలిపోయి, అంతరించిపోయిన మేటి ధ్రువతార! రా...లి...పో...యి..న..ది! [అమితబాధతో క్రుంగిపోతూంటాడు.]

మల్లూ, రూథర్ జాడ తెలిసికొనిరా! పొలిమేరలోనున్న నాగుబామునే మొదట చంపాలి!

[మల్లు వెళ్ళిపోతాడు. మరొకప్రక్కనుంచి వెంటనే రామన్న వస్తాడు.]

రామ:- భో! భో! హో! హో! భోహో!

సీతా:- ఏమిటి రామన్నా!

[మరియొకవైపునుంచి భీమన్న వస్తాడు.]

భీమ:-బాబూ! మునగాలపల్లెంతా శవాలతో నిండిపోయింది।

సీతా:- మునగాలపల్లె వీరులే నేలకూలేరా! మహావీరులే వారు. అబ్బా! భీమన్నా!

భీమ:- అంతేకాదు బాబూ! మీరు కన్పించిందాకా రక్తం ఏరులై మన్యమంతా ప్రవహించాలట. రత్తిసీ రత్తిబిడ్డనూ

సీతా:- ఆఁ! ఏమిటిమల్లూ! రత్తి మన ఆయుధకర్మాగారపు పెద్దకదూ!

భీమ:- ఔను! ఆయుధకర్మాగారపు సంరక్షణలోనే కత్తి... కళ్లుమూసింది!

సీతా:- అబ్బా!

భీమ:- బాబయ్యా! తల్లి శవంమీదపడి పాలకోసం యేడ్చే రక్తబిడ్డను మండుతున్న నిప్పుల్లో యేరాయినో, రప్పనో విసరినట్లు విసరిపారేసినారు.

సీతా:- మా స్వాతంత్ర్యపోరాటానికి వెన్నెముక కర్మాగారమే! ఆయుధకర్మాగారమే తెల్లజాతికి దొరికిపోయిందా? అబ్బా! వందలాది మన్యపుతల్లులు కీకారణ్యములలోకి చొచ్చి తెల్లపురుగు కంటికి కన్పించకుండా, రాత్రింబవళ్లూ కష్టించి సృష్టించిన ఆయుధములన్నీ విరోధులకు చిక్కిపోయినవా? అమ్మా! భారతమాతా! అడుగడుగునా అడ్డంకులేనా?

భీమ:- బాబూ! ఏ పరిస్థితుల్లోగూడా మీరుమాత్రం బైటకు పోవొద్దు. పరిస్థితులు తారుమారైనవి. రూపాయలతో జయచంద్రు లనుకొన్నారు. ఏ క్షణాన యే అన్యాయం జరుగుతుందో తెలియడంలేదు. బాబయ్యా! -మీరు మాత్రం బైటకుపోవొద్దు.

సీతా:- కాదు భీమన్నా! నే పోతాను. నే కన్పిస్తాను. నా కోసం మీరెవ్వరూ బలికాకూడదు. దేశంకోసం మన మంతా బలికావాలి. ఒక్క వ్యక్తికోసం యే ప్రజా బలి కాకూడదు. దానిని చరిత్ర హర్షించదు. దేశంకోసం, యీ మట్టిమీద పుట్టిన మాటలురాని పాష మొదలూ

మాటలువుడిగిన ముసలితాతవరకూ త్యాగం చేయాలి. నా దేశాన్ని, అన్యాయంగా, అక్రమంగా ఆక్రమించి, మానవత్వాన్నే మరచిపోయిన మహిషముల నతమార్చి నా తోడి సోదరులకు జరిగిన అన్యాయానికి ప్రతీకారం తీర్చుకొంటాను.

భీమ:- బాబయ్యా! నామాట వినండి. మీరు పోవొద్దు. నాయకుడు బైటపడకూడదు.

ఉన్మాదుని సంగీతం

[శ్మశానమే ఒక స్వరూపమై ఎలుగెత్తి అరచినట్లు ఒక భయంకర శబ్దవాహిని. పాటపాడుతూ మధ్యమధ్య సింగన్న నవ్వుతూ యేడుస్తూ వుంటాడు.]

రాబందులు
రక్కసులు
దాహముతో
రక్తమునే
త్రాగుచునే
పడగవిప్పి
బుసలుకొట్టు
పాములై: నాగులై
వస్తున్నవి: యిటు
చస్తున్నవి రాజా:
వస్తానే పోతా
పోతా నే వస్తా
వస్తా: పోతా .

వస్తా నే పోతా
వస్తున్నవి! యిటు
చస్తున్నవి రాజా!

సీతా:- [పెద్దగా] సింగన్నా! రాబందుల రెక్కలు విరిగి పోతవి! భీమన్నా! మంచిమాటలతో మెల్లగా సింగన్నను పిల్చుకొని రా!

భీమ:- అలాగే బాబయ్యా!

సీతా:- దేశమాతను కబళించియున్న కబంధహస్తములచూచి యీ దేశములోని ఎంతమంది దేశభక్తులు పిచ్చివా రయ్యేరో! దేశమంటే పడిచచ్చేటంత పిచ్చి దేశభక్తులకు!

నన్నుకన్న ఓ తల్లీ! అమ్మా! నారాయణమ్మా! నీవైనా నన్ను ఆశీర్వదించమ్మా! దేశములోని పరిపూర్ణ దేశభక్తులంతా పిచ్చివాండ్లు కాకమునుపే, యీ తెల్ల జాతి వైదొలగిపోవుటకు నీ బిడ్డ తుదిపోరాటానికి సంసిద్ధు డౌతున్నాడు. వీరమాత జీజీబాయి తనబిడ్డను దీవించి నట్లు, వీరవనిత ఝాన్సీ తనపాపను ప్రథమ స్వాతంత్ర పోరాటంలో అర్పించినట్లు, నీ సీతారామరాజునుకూడా దీవించి, కన్నతల్లి పాదములమీద పుష్పార్చన చేయి తల్లీ! యిక ఆలస్యమునకు వీలులేదు!

[మల్లు ప్రవేశిస్తాడు. కణతమీద కత్తిదెబ్బ తగిలివున్నది. రక్తం కొద్దిగా కారుతూ వున్నది.]

సీతా:- ఏమిటి మల్లూ ఆ గాయం!

మల్లు:- తెల్లజాతికాకి చేసిన ఫుండు,

సీతా:- [సింహగర్జన చేయుచూ] మల్లూ! యుద్ధభేరిని మ్రోగించు! అమ్మా! అది జయభేరని దీవించు! తల్లీ! రక్తముతో బొట్టు పెట్టు!

[రామన్న బాధతో కమిలిపోతూ వెళ్ళిపోయి ఆయుధములను తగిలించుకొంటాడు.]

మల్లు:- బాబయ్యా! యుద్ధభేరిని మ్రోగిస్తాం! అదిగో యుద్ధభేరి! అదే మన జయభేరి! కానీ మీరు మాత్రం బైటకు రావొద్దు. మీ పేరు చెప్తూ, హద్దులుదాటిన స్ఫూర్తితో, సీతారామరాజు రక్షతో మన్యమే ఒక మహాసముద్రమై, తెల్లజాతి సైన్యమును నిలువునా ముంచి నీళ్లు త్రాగించుటకు బైలు దేరుమన్నది. ఆ సముద్రములో గుక్క త్రిప్పుకొనుటకు వీలులేక, రెక్కలువిరిగిన రాబందుల వలె, పడి, చచ్చి, కిలకిల కొట్టుకొనుచున్న ఆ కిరాతకులను చూచుచూ, విజయోత్సాహముతో స్వాతంత్ర్యపతాక నెగుర వేయండి.

సీతా:- కాదు మల్లూ! నేనే స్వయముగా ఒక సైనికుడనై మన్యపు మహాసైన్యమునకు ముందు శంఖారావం పూరించాలి! వీరులారా! కాళికామాత పేరుతో జయభేరిని మ్రోగించండి.

[భీమన్న రంగస్థలంమీద కాలు పెట్టానే 'బాబయ్యా' అని అరుస్తాడు. గుండెమీద తుపాకి కాల్పు. మరో తుపాకి కాల్పుకు మోకాలు విరిగియున్నది. శరీరమంతా రక్తమయం. అది మరణబాధ. వస్తూనే సీతారామరాజు కాళ్లమీద పడ్తాడు.]

సీతా:- భీమన్నా!

మల్లు:- భీమన్నా! తెల్లజాతి ఎక్కడికొచ్చి దెబ్బకొట్టింది.

భీమ - బాబయ్యా! సముద్రం ముంచెత్తుకొస్తున్నట్లు తెల్లజాతి సైన్యం విరుచుకపడుతూవుంది.

సీతా:- భీమన్నా! నీవూ కూలిపోయేవా! నా కుడిభుజం విరిగిందే! సోదరా! నాకన్నా నీవే అదృష్టవంతుడివి! నాకన్నాముందు నీవే జన్మభూమికోసం నీ తనువును నవ్వుతూ అర్పిస్తున్నావ్! ఇక పోతా! అదో కదనరంగం!

[రామన్న గగ్గోలుగా యేడుస్తూ సీతారామరాజుకు అడ్డువచ్చి, పోవొద్దని ప్రార్థన చేస్తాడు.]

[లోపలనుంచి సింగన్న]

అయ్యా! భవిష్యద్భారతి దేశోద్ధారకా! అన్యాయం జరుగుతుందని ఎందుకో అనుమానం కలుగుతూంది! నీవు పోవొద్దు.

మల్లు:- అయ్యా! మీరు పోవొద్దు.

భీమ - బాబయ్యా! మృత్యుముఖంలోనుంచి భీమన్న మాట్లాడుచున్నాడు. వినయా! బాబయ్యా! రూథరే స్వయంగా సైన్యాన్ని నడుపుచున్నాడు. లండన్ నుంచి ప్రత్యేక సైన్యం దిగింది. మన్యమంతా తుపాకులు పేలిపోతున్నవి. మన సైనికులు..మీపేరు చెప్తూ..అంబులను వదలిపెట్టున్నారు. కానీ...మీరు...మాత్రం...పోవొద్దు.

సీతా:- భీమన్నా!

భీమ:– ఔను బాబయ్యా! మీ కాళ్ళకు దణ్ణంబెట్టా! మీరు మాత్రం పోవొద్దు. మీరు వెనుకనుండి ఆఖరుదాకా యుద్ధం నడపండి. ఈ మన్యంలోవుండే మాటలురాని పసి పాపకూడా మీ నాయకత్వంక్రింద పోరాడి దేశంకోసం బలి అయిపోతుంది. కానీ మీరుమాత్రం పో...వొ...ద్దు! మీకు...జై! భా...ర... త...మా... తాకీ జై!

[భీమన్న చనిపోతాడు. శవం రంగస్థలంమీదనే పడివుంటుంది.]

మల్లు:– బాబయ్యా! మా మన్యమంటే యిది! మీరు బైట పడకూడదు! మీరు బైటకొస్తే విప్లవం భగ్నమౌతుంది.

సీతా:– మల్లూ! నేను బైటపడాలి. నామూలంగా మన్యం నాశనం కాకూడదు.

మల్లు:–బాబయ్యా! మన్యంలోని తుదిసైనికుని శరీరంలో తుది రక్తపుబిందువు వున్నంతవరకూ, మీకోసం, దేశంకోసం పోట్లాడుతూనే వుంటుంది మన్యం. మీరు బైటకుపోతే అన్యాయం, ద్రోహం జరగొచ్చు. మన తల్లికన్న దుర దృష్టపు సంతానం, ఎంగిలిఆకులకు ఆశపడి, మిమ్ములను, మిమ్ములను...

సీతా:– అన్నీ తెలుసు. కానున్నది కాకపోదు; రానున్నది రాకపోదు. నిరాయుధుడనై గాదు; లొంగి రాజీలకు కాదు; జంకి దాసోహమని కాదు. కానీ, నా జన్మభూమి పైననే, నా సోదరులను, నా తల్లులను తాకితే కందిపోవు చిన్నారిపాపలను హత్యచేసే హంతకుల శిరస్సుల నేల మీద రాల్చుటకు.

మల్లు:— వేలమంది హంతకుల మధ్యకు...మీరొక్కరుగా

సీతా:— సీతారామరాజు, నిరాయుధుడుగా కాక, శస్త్రఖడ్గ కవచధారియై పరుశురామునివలె, ఒంటరిగా లక్షలమంది శత్రుమూకలమధ్యకు బైలుదేరుచున్నాడు.

మల్లు:— బాబయ్యా! [బాధతో అరుస్తాడు. పోవద్దని అడ్డగించ బోతాడు.]

రామ:— హో హో హో! [పెద్దగా యేడుపు. జాలిగా కన్నీరు.]

లోపల; సిం:— బాబయ్యా! పోవొద్దు! ఇది సింగన్న ప్రార్థన! బైటకు పోవొద్దు

సీతా:— అదే కదనరంగ.! ఈయుద్ధంలో తెల్లజాతి పతనమో సీతారామరాజు వీరస్వర్గమో! నా సోదరుల రక్తం యింకొక్క బిందువుకూడా యీ ధరాతలిమీద చింద కూడదు.

అమ్మా! జగన్మాతా! జన్మభూమి, నన్నుకన్న ఋణం తీర్చేదానికోసం నీబిడ్డ తుదిపోరాటానికి బైలుదేరు చున్నాడు. దీవించినా దీవించకపోయినా అంతానీ దేభారం! వందేమాతరం! వందేమాతరం!

[సీతారామరాజు అడ్డమొచ్చిన కోయలను తప్పించుకుంటూ, క్రింద నున్న శవమును దాటుచూ శూన్యంలోచూస్తూ అంబు బాణములను ఖడ్గ మును తీసుకొని వెళ్లిపోతాడు. మల్లు, శవముప్రక్క నిలబడి సీతారామ రాజు పోయిన వైపుకు చూచుచూ నిలబడియుంటాడు. రామన్న సీతా రామరాజుని అనుసరిస్తాడు. పాట నేపథ్యంలోనుంచి విన్పిస్తూవుంటుంది. తెరవాలుతుంది.]

## స్వేచ్ఛాగీతం

కదంత్రొక్కి
పదంపాడి
కదలిరండి
కదనరంగము ॥ కదన ॥

శంఖమును పూరించి
జయభేరిని మ్రోగించి
తొడనుగొట్టి వీరుడా
పోరుసల్పు జోధుడా ॥ పోరు ॥

జయం మంది
భుజం భుజం
కలప రండి
కదనరంగము ॥ కదన ॥

దాస్యమనసంకెళ్లు
విరగగొట్ట కదలరా
స్వేచ్ఛతో గంజినీళ్ళు
ఆనందం మనకదిరా ॥ ఆనందం ॥



# తుదిరంగం

[ దూరంగా కొండ కన్పిస్తుంది. ఆ కొండకు క్రిందభాగంగా రూథర్ గుడారం కన్పిస్తూవుంది. గుడారంలో ఒక రౌండ్ టేబుల్, నాలుగు కుర్చీలు, ఆఫీసు రికార్డులు టేబుల్ మీద పడివుండవి. ప్రక్కనే ఒక రూళ్ళకర్ర వుంటుంది. ఆంధ్రదేశపటం గోడకు తగిలించివుంటుంది. రూథర్ దొర ఆ దేశపటాన్ని తన రూళ్ళకర్రతో పాయింట్ చేస్తూ బాప్టి యన్ కు చూపిస్తూవుంటాడు. టేబుల్ మీద కొన్ని బ్రాందీ సీసాలు, గ్లాసులు, దొరల చుట్టలు పడివుంటవి. వారప్పుడప్పుడూ బ్రాందీ త్రాగుతూవుంటారు. తుపాకులు, రైఫిల్స్ మొదలైన ఆయుధములు గుడారములోవుంటవి. మొత్తంమీద ఆ గుడారంలో మిల్టిరీ వాతావరణం నిండుగా కన్పిస్తూ వుంటుంది.]

రూథర్:- బాప్టియన్! యిండియన్స్ చేసే యీ చిన్న ఫైట్ ను అణచలేక పోయినావా?

బాప్టియన్:- సార్! మీరు అనుకొన్నంత చిన్నాదికాదు యీ ఫైట్.

రూథ:-యిఫ్ సో, యీ ఫైట్ చాలాచాలా పెద్దది అంటావా? వాట్ బాప్టియన్! యీజిట్ సో?

బాప్టి:- యస్ సార్! ఈ మన్యంలో వుండే మానుష్యులు సామాన్యమైనవారు కాదుసార్! చాలా గొప్ప ధైర్య వంతులు సార్.

రూథ:- ఊత్త వ్రాత్త ధైర్యవంతులు మాత్రమే అయితే, వుపాయంతో తుపాకులతోనే ఏందుకు ఫైర్ చేయ కూడదు.

బాస్టి:- యీండియన్స్‌కు మాంచి యింటెలిజెన్సు వున్నది సార్! మన్యంలో వున్న చెట్లకు చివరిభాగాల్లో వుత్త వుత్త గుడ్డలు చుట్టి మాకండ్లకు మనుష్యులుగా చూపించినారు సార్! వాళ్ళదగ్గర పెద్ద పెద్ద మాంత్ర ములుగూడా వున్నవిసార్! మేము వేంటనే గన్సును, వన్ బై వన్, వన్ బై వన్ కాల్చినాముసార్! మాదగ్గర వున్న సెల్స్ అన్నీ అయిపోయినవి సార్! ఒక్క యిండి యన్‌కూడా చావలేదు. కొంచెము కొంచెము ధైర్య ముతో పోయి మేము యిన్స్పెక్ట్ చేసినాము. ఒక్క మనిషికూడా చావలేదు. అవి అన్నీ పెద్దపెద్ద మాండ్ల వున్న చిన్న చిన్న పొదలు, మా దగ్గర సెల్స్అయి పోయిన వేంటనే, ప్రక్కనేవున్న పెద్ద పెద్ద చెట్లమీద నుంచి అల్లూరి సీటారామరాజు సైన్యం మన ఫోర్సుమీదకి దుమికినదిసార్. మన సైన్యమంతా స్మేష్ సార్! స్మేష్!

రూ:- వాట్ ?

బా:- మేము కొండమీదకు సైన్యముతో యేక్కుతూవున్న పుడు రాజు సైన్యం కొండలమీదనుంచి పెద్దపెద్ద బాండ లను నెట్టి వేసింది.

రూ:- హోవ్ !

బా:- యస్ సార్! అంతా చట్నీసార్! చ...ట్నీ!

రూ:- వాట్ ?

బా:- మిడ్ నైట్ అడవిలో మేము పోతూ వున్నపుడు రాజు సైన్యం మా మీదకి భయంకరమైన పెద్దపెద్ద అడవి క్రూరమృగములను తరిమినది సార్ !

రూ:- యింటెలిజెంట్ యిండియన్స్!

బా:- యస్ సార్! యిండియన్స్ ఆర్ యింటెలిజెన్స్?

రూ:- యూ కమాన్.

బా: యస్ సార్! లైన్స్‌బేర్స్‌నుంచి తాప్పించుకొనేటందులకే మా సెల్స్ అయిపోయినవి. ఈమధ్య మాకు మిగిలియున్న కొద్దికాలములోనే రనప్ చేసినాం సార్; రనప్! కాళ్ళకు బుద్ధిచేప్పి మేము రనప్ చేయకుండా వుండియుండినచో మేము యీ యిండియన్ హీరోస్ ముందు ఓక్కరము గూడా మిగలము సార్!

రూ:- నాన్సెన్స్! అల్లూరి సీటా రామరాజునే ఏందుకు పాట్ట కూడదు!

బా:- ఆతనంటేనే చాలా భయంసార్! ఆతను చాలా ధైర్య వంతుడు. ఆయనపేరు వింటేనే టెర్రర్.

రూ:- వాట్! పేరులో మెస్మరిజం వున్నదా?

బా:- కరెక్ట్ సార్! మీరు చాలా కరెక్ట్ సార్! ఉన్నట్లు వుండి సీటా రామరాజు యీ నిముషంలో యిక్కడే కన్పిస్తాడుసార్! ఇదే నిముషములో వేరొకచోట కన్పి స్తాడు సార్! అదే సెకండ్‌లో సీటారామరాజు యింకొక పోలీస్‌స్టేషన్ మీదపడి దోపిడీ చేస్తాడుసార్!

రూ:- ఎందరు సీటా రామ రాజులున్నారు? ఓక్క సీటా రామ రాజును పట్టుకొనుటకు ఎందుకు భయము! ఓహ్! యూ ఫ్ట్ రాల్ హి యీజ్ ఎన్ యిండియన్! [త్రాగుతూ] ఓహ్! బాష్టియన్! నీవు ఓక్కడివి ఎందుకు అల్లూరి సీటా రామరాజును అరెస్ట్ చేయకూడదు. వాట్ బాష్టియన్! నీకు మాంచి బలమున్నది. మాంచి ధైర్యమున్నది! మాంచి పేద్ద బుద్ధి వున్నది. వాట్.

బా:- [బిత్తరపోతూ] సార్! నేనా మై... సెల్ఫ్!

రూ:- యస్! నీవు! యువర్ సెల్ఫ్! బ్రిటిష్ హీరో! నీవు ఒక్క యిండియన్‌ను పట్టలేవా?

బా:- నో సార్! యింపాజిబుల్!

రూ:- [విసుగుతో] కవర్డ్స్! పిరికిపందలు! అతనికి మనకంటే యేమైనా బలమున్నదా?

బా:-యస్ సార్! ష్యూర్లీ సార్! డెఫినట్ సార్! నో డౌట్ సార్! ఓక్క అల్లూరి సీటా రామ రాజుమాత్రమే ఒక దినము ఓక్క తాటిచెట్టును ఓక్క చేతితో లాగి రెండుకొండలకు మధ్య బాటగా నిర్మించినాడు సార్!

రూ:- యింపాజిబుల్!

బా:- నో సార్! పాజిబుల్ సార్! పేద్ద టైగర్సుకూడా సీటా రామరాజు దగ్గరకు వచ్చి ఆయన పాదములకద్ద తున బుల్ డాగ్స్ కూర్చొన్నట్లుగా కూర్చొందును సార్!

రూ:- వాట్! వండర్ ఫుల్! దేన్! యింకా చెప్పుము?

బా:-ఒక దినం సార్! ఒక పెద్దపులి అడవిలో ఆయనమీదకు దుమికిందిసార్! నాపేరు అల్లూరి సీటారామరాజు అని చెప్పినవెంటనే టైగర్ వెనుకకుతిరిగి పరుగెత్తి వెళ్ళి పోయినదిసార్!

చూ:- వెరీ వండర్! ఇది అంతా మిష్టీరియస్‌గా వున్నదే! ఈ యిండియానే యింకనూ మనకు అర్థము కాకుండా యున్నది! ది సీక్ మిష్టీరియస్ యిండియా! ఎవ్వరికినీ అర్థముగాదు! అర్థము అయినట్లుగనే వుండుచూ అర్థము కాకుండానే యింకా వుండును. ఈ రూథర్‌కుకూడా యీ యిండియా అర్థము కావడము లేదు!

[లోపలనుంచి పిచ్చిపిచ్చి అరుపులు, భయంకరశబ్దములు, యేడ్పులు నవ్వులు భీభత్సముగా విన్పించుచుండును. రూథర్, బాప్టియన్లు చిత్తరగా అటూయిటూ తిరుగుచూ వుంటారు. సింగన్న ప్రవేశిస్తాడు. సింగన్న పిచ్చివాడై ఒక మంత్రాలరాయడుగా కన్పిస్తాడు. చేతిలో ఒక నల్లటి కఱ్ఱ వుంటుంది. శరీరమునకు నల్లటి దుస్తులను ధరించియుంటాడు. మొత్తంమీద సింగన్న వికృతంగా, భయంకరంగా కన్పిస్తాడు. సింగన్నను చూచినవెంటనే, రూథర్ బాప్టియన్లు భయపడి వొణికిపోతారు.]

సింగన్న:- రేయ్! ఎవడివిరా నీవు! రూథర్‌వా! నీవురా! [వెకిలిగా నవ్వు] బాప్టియన్‌వా! రూథర్! ఓ రేయ్, రూథర్! నీకే కాదు, యే రూథర్‌కూ యీ దేశం అర్థం కాదురా! మీ దృష్టి అర్థంచేసుకొనే దృక్పథంలో లేదురా! మీ చూపంతా కొంపలో జొరబడ్డ దోపిడీకుక్క చూపురా. [పెద్దగా నవ్వు. లోపల భయంకరశబ్దాలు.]

రూ:- అయ్యా! తమరు ఎవరండీ!

బా:- మీకు మావలన యేదైనా సహాయము కావలసి యున్నచో అడుగుము! మేము మీకు ఆ సహాయము చేసెదము.

[సింగన్న నవ్వుతాడు. అవి భయముగొల్పు వికటాట్టహాసములు. సింగన్న యేడుస్తాడు. కొండల కరిగించు కన్నీటి ధారలు రాలును. రూథర్ బాష్టియన్‌లకు యేమీ అర్థంకాదు. భయంమాత్రం పూర్తిగా తొలగిపోలేదు.]

సిం:- తెల్లజాతికుక్కా! రూథర్! [నవ్వుతూనే యేడుస్తాడు.] మా తెనుగువీరుల మాణిక్యం పలనాటి వీరహనుమంతు! సైనికులారా! వీరహనుమంతు పేరుచెప్పి జయభేరి ప్రోగించండి!

[దయ్యములు అరచినట్లు లోపలనుంచి శబ్దములు. సింగన్న నవ్వుతాడు. రూథర్ టేబుల్‌మీదయున్న కత్తిని తీసుకొంటాడు. రూథర్‌కు కోపము భయము రెండూ కలుగుతవి.]

రూ:- హు యీజ్ దిస్ యిండియన్! బాష్టియన్! హు యీజ్ దిస్ మేడ్‌మేన్!

బా:- సార్! సిం..గ..న్న సార్! పిచ్చివాడు సార్!

[రూథర్ భయమును పొగొట్టుకొని నవ్వుతాడు. బాష్టియన్ మాత్రం భయపడుతూనే వుంటాడు.]

సిం:- పిచ్చివాడు! అవును! పిచ్చివాండ్లను చేసే యంత్రానివి నీవు! మాకుపిచ్చి! నీకు మదపిచ్చి! రేయ్! రూథర్! యీ కత్తితో నిన్ను పొడుస్తా! నన్ను నీవు పొడుస్తావా! వొద్దు రూథర్! మాఅమ్మ ఏడుస్తుంది! రూథర్! నీరక్తంత్రాగితే

నాకడుపు నిండుతుంది. ఈ కత్తితో పొడుస్తా! పొడుస్తా! దొంగను పొడుస్తా! దారిదోపిడీగాండ్లను పొడుస్తా! అన్యాయాన్ని పొడుస్తా! నీమెడను నాకత్తి ముద్దుపెట్టుకొంటుంది! నీవంటే నాకత్తికి యిష్టం! రా! రూథర్! వొద్దులే! నేనే వస్తాలే!

[సింగన్న కత్తి విసరబోతాడు. రూథర్ వెంటనే రివాల్వారు తీసి కాల్చబోతాడు. సింగన్న పెద్దగా నవ్వుతాడు. కత్తివిసరి క్రిందకు కొట్టాడు. కాపాలికునివలె భయంకరంగా తలనాడిస్తూ పెద్దగాఅరుస్తాడు సింగన్న.]

సిం:- హూం! హ్రీం! హూం! భూం! మంత్రాల మఱ్ఱి చెట్టూ!

లోపల:- ఏమికావలెను ?

సిం:- [పెద్దగానవ్వుతాడు] ఈరూథర్ చేతిలోని రక్తదాహపు రివాల్వారు క్రింద పడవలెను!

[లోపలనుంచి పెద్దగా నవ్వు]

లోపల:- సరే!

[రూథర్ తనచేతిలోనున్న రివాల్వారును గట్టిగా పట్టుకొంటాడు. కానీ అది క్రిందబడ్తుంది. రూథర్ పెద్దగా అరుస్తాడు.]

సిం - మంత్రాల మఱ్ఱిచెట్టూ! నీ చెట్టుపైనున్న తెల్లజాతి శవముల కంకాలాలను ఒక్కసారి అరిపించు!

[లోపల కోటిభూతములు అరచినట్లు నవ్వు]

రూ:- వాట్!

బా:- ఫియర్! ఐ ఫియర్!

[సింగన్న మరింత పెద్దగా నవ్వుతాడు. సింగన్నతో బాటు లోపల నుంచి భూతప్రేత పిశాచగణముల భయంకర వింత వింత శబ్దములు విని పించును.]

సిం:- మంత్రాల మఱ్ఱిచెట్టూ!

లోపల:- ఏమికావలెనూ?

సిం:- తెల్లజాతి కోతుల కంకాలాలను క్రిందకు రాల్చూ!

[పెద్ద పెద్దగా అరుపులు — ఎముకగూళ్ళు, కపాలాలు క్రింద పడ్తవి. రూథర్ పెద్దగా అరుస్తాడు. బాప్టియన్‌కు యేడుపొచ్చినంత పని యగును.]

రూ:- అయ్యా! మమ్ములను క్షమించండి!

బా:- మీ భారతీయుల పాదములకు మేము అధికముగా భక్తి కలిగిన నమస్కారములను చేయుదుము. మమ్ములను వదలి రక్షింపుడు

[సింగన్న పెద్దగా నవ్వుచూ వెళ్లిపోతాడు. రూథర్, బాప్టియన్లకు పోయిన ప్రాణం వచ్చినట్లు సంతోషపడతారు.]

రూ:- బాప్టియన్!

బా:- సార్!

రూ:- ఒకటిపోయిన మరియొకటి నెత్తిన పడుచున్నది. యిండియాలో ఎన్ని ఎన్నియో వింతలు యున్నవి. హోప్! ఐ కెనాట్ డిస్కవర్ యిండియా! యిండియా యీజ్ ఫుల్ ఆఫ్ మిష్టరీస్!

బా:- అందులో యీ మన్యమే ఒక్క మిష్టీరియస్!

రూ:- సీటారామరాజుగారి అసిస్టెంట్స్ యింత పెద్ద భయ
ముగా వుంటే...

బా:-సీటారామరాజుగారు యింకన యేవిధముగా వుందురో,
అని అంటున్నారా?

రూ:- అవును!

[ఒక యిండియన్ వస్తాడు. అతను అరవదేశస్తుడు. అతని పేరు
పిళ్ళై.]

రూ:- వాట్ యిండియన్! వాట్ జ్ ది న్యూస్?

పిళ్లై:-నాశనం! మలబారుసైన్యం కోయగూడెంమీద పెట్రోల్
పోసి మంటాలు పెట్టిందిసార్!

రూ:- గూడ్! జయంమూంది! మీ యిండియన్స్‌లో గూడా
మూంచివాండ్లు వున్నారు. నీవు చాలా మూంచివాడవు.
[త్రాగుతూ నవ్వుతాడు.]

పి:- పసిబిడ్డలుగూడా కూక్కలు, పిల్లులు మాడిపోయినట్లు
మలమల మాడిపోతున్నారు.

బా:- పిళ్లైగారూ! మీరు చాలా గోప్పవారు! మీ పేరుకే
మా దేశములో చాలాపెద్ద గౌరవమున్నది. మీబోటి
వారి సహాయమువల్లనే మేము మీ దేశమును సుఖముగా
రాజ్యము చేయుచున్నాము.

పి.-[నవ్వుతూ] నాదిదా యేమున్నది సార్! మీరుదా చాలా
మూంచివారు. మీరుదా దేమునిబిడ్డలు.

రూ:-సీటారామరాజు తన ధైర్యమును యిప్పుడు చూపమను. భారతీయులధైర్యమును యెప్పుడు యింకా బాగుగా ప్రదర్శించమను. సిన్సియర్ యిండియన్! నీలాంటి యిండియన్స్ యీ దేశం అంతా వుంటే, మీ దేశానికి మాంచి శాంతివుంటుంది. అల్లూరి సీటారామరాజుల్లాంటి మనుష్యులవల్లనే మీ దేశానికి యీంత పెద్ద ఆపదలు కలుగుచూ యున్నవి.

బా:- యస్ సార్! యు ఆర్ కరెక్ట్ సార్!

పిళ్లై:- ఆమాసార్! మీరుదా రొంబా సత్యంపల్కితిరి సార్!

రూ:- పిళ్ళై! యీ దేశములో శాంతిలేకుండా, ఎల్లప్పుడూ బ్రిటిష్ వాండ్లమీద యుద్ధాలు చేసే ఫేమిలీస్, ఫేమిలీస్‌గానే మొత్తంగా చంపిపారెయ్యండి. నిద్రబోయేటప్పుడు యిండ్లల్లో పాయిజన్ బాంబ్ గ్యాస్‌ను వదలిపెట్టండి. అప్పటికి యీ దేశములో అల్లరిచేసే గుంపులన్నీ నాశనమైతాయి.

బా:- యస్ సార్! అంతటితో యీ దేశంలో మాంచి శాంతి వుంటుంది. మీరు చాలా యింటెలిజెంట్‌గా మాట్లాడుతారు సార్!

పి:- కరకెట్టు సార్! మీరుదా చాలా కరెకెట్టు సార్!

రూ:- యిండియన్! నీవు పో! మన్యమంతా మట్టిలో కలసిపోవాలి. బాప్టియన్! పాస్ ఆర్డర్స్! అంతా స్మాష్ కావాలి. మన్యంలోనుంచి ఒక్కమనిషికూడా బ్రతికి

బైటపడకూడదు. సీటా రామరాజుని ఎక్కడ కన్పిస్తే అక్కడే ఫైర్ చేయండి.

పి:- ఆమా సార్! మీరుదా చాలా తెలివిగా చెప్తారు. సార్!

బా:-యస్ పిళ్ళై! సీటా రామరాజుని వెంటనే చంపివేయవలెను.

రూ:- సీటారామరాజుల్లాంటి మనుష్యులను వదలకూడదు. యిండియన్! సీటా రామరాజుల్లాంటి విప్లవకారులవాల్లనే శాంతినిగోరే నీలాటి మాంచివారికినిగూడా కాష్టములు పేద్ద నాష్టములు తరుచుగా వాచ్చుచున్నవి. మీ మంచిని కోరేమేము యిాప్పుడు మీసీటా రామరాజుతో యూద్ధము చేయుచున్నవారలము.

బా:-మీ యిండియన్స్ యొక్క మాంచినికోంయే దూరదృష్టి కలిగిన మేము మీ సీటా రామరాజుని యిాప్పుడు ఫైర్ చేయబోవుచున్నాము.

పి:- ఆమా సార్! యునకు తెరియంసార్. మీరు తెల్లవాండ్లు యేపనిచేసినా మా సుఖమునుగోరే చేస్తురు! ఈ రోడ్లు, యిా రైళ్లు మీరుదా మా దేశములో వేయించలేదూ! మీరుదా ఎంత మంచివాండ్లుసార్! మీరు మాకు చేసిన సాయమునుదా మా యిండియన్స్ యిా జీవితములో మరచిపోరు.

బా:- పిళ్ళై చాలా మాంచివాడు! పిళ్ళై! యు ఆర్ వెరీ నైస్ మేన్!

రూ:- మంటాలు చల్లారకముందే మూలమూల పెట్రోల్ పోసి మంటలను పెద్దవి చేయండి. యిండియన్స్ మంచి నీరు త్రాగే మంచినీటి బావులలో పాయిజన్ కలపండి. పాయిజన్! పాపాలు చేసిన యిండియన్స్ పాపాలు ఆంతటితో పండిపోతవి.

బా:- యస్ సార్! మీరు చాలా కరెక్ట్‌గా చెప్పినారు సార్! యిండియన్స్ యొక్క దౌర్జన్యపు క్రియలు ఆంతటితో అంత్యమగును.

రూ:- ఓ ఒబీడియంట్ యిండియన్! మీ నల్ల మనుష్యులు యింకా చావకుండా యీమన్యములో బ్రతికియున్నారా?

పి:- ఆమా సార్! యింకనూ ఒక్కొక్కదినము ఒక్కొక్క పోలీస్ స్టేషన్ దా అన్యాయమైపోతుంది సార్! మన బాంబ్స్ కూడా యీ మన్యములోదా పని చేయడంలేదు సార్! రొంబా కష్టందా వున్నది సార్!

బా:- వాట్ పిళ్ళై!

రూ: యింకనూ యీమన్యములో బ్రతికియున్న మనుష్యులు ముసలివారైనా లేక అప్పుడే పుట్టిన చిన్న చిన్న పాపలైనా సరే, డబుల్ బార్ గన్సుతో షూట్ చేయండి. ఈనాడు చిన్న పాపలైనా యీ యిండియన్ చిన్న బుడుతలే రేపు పెద్దవారై ఒక్కొక్కరు ఒక్కొక్క అల్లూరి సీతారామరాజు కావచ్చు. ఆ కారణముచేతనే చిన్న చిన్న బిడ్డల్ను, గార్భనతుల్ను నిలువునా కాల్చి చంపండి.

శా:- యస్ సార్! దట్ యీజ్ కరెక్ట్ సార్

పి:- రొంబా ఐడియా సార్! యనకుదా సంతోషమా యిరికేది.

రూ:- యిండియన్! నీవు మాకు చాలా చాలా ఆనందమును కలిగించుచున్నావు. నీవు చాలా వృత్తముండవు. ఈ ఫైట్‌లో మనకు, సంపూర్ణ విజయమువచ్చిన వెంటనే యీ మన్యములో మాకు హక్కు అనుభవముకలిగియున్న ఒక్క వందఎకరముల మాంచి భూమిని నీకు ప్రెజెంట్ చేస్తాము. ప్రెజెంట్!

శా:- పేద్దపేద్ద కంట్రాక్టులను మరియూ పేద్దపేద్ద ఆదాయముల వచ్చు మా బ్రిటిష్‌ప్రభుత్వపు కార్యములనూ, నీకు యిచ్చుచుందుము.

పి:- మీరుదా చాలా మాంచివాంఢ్లు సార్! మీలాంటివారంటే మా యిండియన్స్‌కుదా చాలా యిష్టం.

రూ:-యస్ యిండియన్! మేము ఆడినమాటాలను ఎన్నాటికీ తప్పాము. నీకు మాంచి ఆస్తులను యిస్తాము. మా బ్రిటిష్‌వాండ్లు ఎల్లప్పుడూ సత్యమునే చెప్పాదురు. యిండియన్! ఓ ఒబీడియంట్ యిండియన్! యిప్పుడు మన్యమంతా నాశనమైనట్లేనా?

పి:-అనుమానముదా మీ కెందుకుసార్! నేనుదా నా చేతితో ఎన్నో యిండ్లమీదదా పెట్రోల్‌పోసి తగులబెట్టితిని. మన్యందా నాశనమైపోయింది సార్!

రూ:- యస్. యిండియన్! విక్టరి యీజ్ అవర్స్ యిండియన్! మీ స్మశానములో కన్పించీ కన్పించకుండా ఒక పేద్ద టైగర్ తిరుగుచూ యున్నది.

పి:- యనకుదా అర్థం కావడము లేదు సార్! యనకుదా తెలిసేటట్లుగా చెప్పండిసార్! నేనుదా మొత్తము చెప్తును.

బా:- వాట్ యిండియన్! అనగా, అల్లూరి సీటారామరాజు అనే పేద్దపూలి యింకనూ చావకుండా తిరుగుచూ వున్నది.

రూ:- యస్! యువార్ కరెక్ట్ బాప్టియన్! యిండియన్! ఆ సీటారామరాజు ఎక్కడ వున్నాడో, ఆ రహస్యములను తెలిసికొని మాకు తెలియచేయాలి. అది డేంజరస్ టైగర్! చాలా తెలివితో నీవు ప్రవర్తించవలెను.

బా:- యిండియన్! చాలా జాగ్రత్తగా వాచ్ చేయి. ఆ టైగర్ కు కన్పించినావా, నీ రక్తమును త్రాగివేస్తుంది.

రూ:- వాట్!

బా:- యస్ సార్!

పి:- అదెల్లా యనకు తెరియంసార్! ఆ పని నాకుదా రొంబా తెరియంసార్! ఆ పని నాకుదా రొంబా సులభము. రాజుగారు, అల్లూరి సీతారామరాజుగా యిప్పుడు కన్పించడుదా. సోదెవాని వేషంలోనో, యిల్లియా ఒరు మంత్రము చెప్పువాడుగనో, అదీ యిల్లయాయన్నా ఒరు నల్లా పాటలు పాడుకొనే పెరియా సన్యాసిగానో

తిరుగుచూాదా వుండునుసార్! ఆ వుపాయములన్నీదా
మాకు బాగుగా తెలుసు.

రూ:- గుడ్ ఐడియా! యు ఢియన్! ఐ కంగ్రేట్యులేట్ యు.
నీవు చాలా తెలివిగల్లవాడవు. యూ గో ఆన్ యిండి
యన్! ఎప్పటికప్పుడు ఆ టైగర్ విషయములు మాకు
తెలియచెయ్యి.

బా - ఇక్కడ మన విషయములను బైట చెప్పకూడదు.

పి:- నా పేరుదా జయచంద్రపిళ్లైసార్! మేముదా నమ్మించి
ద్రోహం చేయంసార్!

రూ:- నీవు పోయి పనిచేసుకోని తిరిగివచ్చి మాకు కనిపించ
వలెను. టై-గ-ర్! యాఫ్టరాల్, దటీజ్ ఎన్ యిండియన్
టైగర్!

బా:- యస్ సార్! నో-సా-ర్.

రూ:- [బాప్టియన్ వైపు విసుగ్గా చూస్తూ] వాట్!

బా:- నో, సార్! యాఫ్టరాల్ ఢస్ యీాజ్ ఎన్ యిండి
యన్ టైగర్ సార్!

రూ:- యిండియన్! నీవు వెళ్ళిపో. సుఖమును, మాంచి
ఆరోగ్యమును కలుగచేయు యీా బ్రాందీని త్రాగుము.
నీ తెలివి అప్పుడు యింకా ఎక్కువగా షైన్ అవుతుంది.
టైగర్ సీటా-రామరాజును యింకా సులభముగా పట్టు
కొంటావు. [బ్రాందీ సీసాను యిస్తాడు.] యింకన నీవు
వెళ్ళిపోవచ్చును.

[పిళ్ళై విష్ చేసి వెళ్ళిపోతాడు.]

రూ:- బాప్టియన్!

బా:- సార్! వాట్ సార్!

రూ:-పాసాన్ ఆర్డర్స్! మన్యములో, మన్యపు బౌండరీస్‌లో ఎవ్వరు కనుపించినా వాండ్లను కాల్చుమనండి. పులిరాజులనీ, కోయిరాజులమనీ, తేనె అమ్మే కొండజాతివారమనీ, అడవినుందులమ్మే పేద్దపుంజులనీ, భజనలు చేసే స్వాములమనీ, పాటలుపాడే భద్రాద్రి భక్తులమనీ యింకా యింకా చాలాచాలా మారుపేర్లు పెట్టుకొని తిరుగుచూన్న ప్రతి యిండియన్నీ కాల్చుమను. చిట్టచివరకు బెగ్గర్సునుకూడా ఫైర్ చేయమను. అంతా డేంజరస్‌గా వుంది.

బా:- యస్ సార్! కన్పించినవారందరూ షాట్ డేడ్!

[పిళ్ళై వస్తాడు. సెల్యూట్ చేస్తాడు.]

రూ:- వాట్ పిళ్ళై! వాటీజ్ ది న్యూస్?

పి:- ఒన్నూమిల్లే సార్! అంతా మనకుదా జయంసార్! మన్యంకు ప్రక్కగావున్న గూడెము రాత్రి, వున్నట్లుండి రొంబా ఫైట్‌కు రెడీ అయ్యిందిసార్! అది పెరియా ఫైట్ సార్! మన సైన్యందా చాలా చచ్చిపోయింది! వున్న కొద్దిమంది సైన్యందా వెనుకకుతిరిగి పరుగెత్తిదా రాబోయింది. నేనుదా అప్పుడు యేమిచేసేనో తెరియుమా సార్!

రూ.- యిండియన్! నీవు చాలా తెలివిగల్ల పనిని చేసివుంటా వనే మా వుద్దేశ్యం.

పి:-అవునాసార్! నేను ఆగూడెపు సైన్యము వెనుకకు మన్యము వానివలె పోయి పాయిజన్ గ్యాస్ బాంబ్స్ వదలినాను సార్.

బా:- పిళ్ళై! నీవు చాలా తెలివిగల్లవాడవు! నీ ఉపాయంతో ఆ గూడెపు సైన్యమంతా నాశనమైనది కదూ!

రూ:- నో డౌట్! [ఒక బ్రాందీసీసాను పిళ్ళైకు యిస్తాడు.]

పి:- అవునాసార్! ఆ గూడెమంతా నాశనందా అయిందిసార్! ఆబాంబ్ గ్యాస్‌కు కొలందలుగూడా పెద్దపెద్దగా యేడ్చి చిన్న చిన్న నల్లులు చచ్చిపోయినట్టు చచ్చినారుసార్!

రూ:- గుడ్ పిళ్లే! నీ రాజభక్తికి మేము చాలా మెచ్చినాము. నీయొక్క భక్తికి మేము యీమన్యంలో నీకు ఒక్క ఐదు వందల ఎకరభూములమిని ప్రెజెంట్‌గా ఇచ్చుచున్నాము. బాప్టీయన్! యిన్వైట్ ది బ్యూటీ డ్యాన్స్! ఈ పవిత్రమైన సమయంలో యీ రాజభక్తికిగల యిండియన్ గౌరవార్థం బ్యూటిఫుల్ డ్యాన్సును చేయించండి. ఆంగ్ల నృత్యములోని అందమును భారతీయులను అనుభవించమను. ప్రపంచములోనే మన వింతనృత్యమునకు ఒక ప్రత్యేకస్థానము యున్నది. కమాన్ బాప్టీయన్! విత్‌ఔట్ డిలే యిన్వైట్ ది బ్యూటీ డ్యాన్స్!

[బాప్టియన్ చేతులను తట్టాడు. పదహారేండ్ల ఆంగ్లయువతి పాట బాడ్తూ నృత్యముచేయుచూ వస్తుంది. రూథర్, బాప్టియన్, పిళ్ళె ముగ్గురు త్రాగుతూ నృత్యమును అనుభవిస్తూ వుంటారు.]

## ఆంగ్ల నృత్యగీతము

హ్యాపీ! హ్యాపీ! బ్యూటిఫుల్ డ్యాన్స్ హ్యాపీ
మూన్‌లైట్ హ్యాపీ! హ్యాపీ....మూన్‌లైట్ హ్యాపీ
స్మోకింగ్‌లో డ్రింకింగ్ హ్యాపీ....హ్యాపీ....హ్యాపీ
ప్లెయిన్ జర్నీ హ్యాపీ—బోటు జర్నీ బ్యూటీ
హ్యాపీ, మోర్ హ్యాపీ నా బ్యూటిఫుల్ డ్యాన్స్ హ్యాపీ
లైఫే ఒక హ్యాపీ
కైఫే ఒక హ్యాపీ
లైఫే ఒక వైఫ్
వైఫే ఒక లైఫ్
వైన్ లేని లైఫే
వైఫ్ లేని లైఫే
మియ్యర్ వేష్ట్! మియ్యర్ వేష్ట్! మియ్యర్ వేష్ట్!
డియ్యర్ ఫ్రెంఛ్! డియ్యర్ మిష్టర్! డియ్యర్ ఫ్రెండ్
డ్రింకింగ్ లేని లైఫ్ యీజ్ వేష్ట్
డ్రింకింగ్ బ్యూటీ, బ్యూటీ డ్రింకింగ్
అంతా బ్యూటీ, వరల్డ్ బ్యూటీ
ఎంజాయ్! హార్ట్‌వుంటె ఎంజాయ్
ఆర్ట్ అంటు, వుంటె ఎంజాయ్
మూడ్ అంటు, వుంటె ఎంజాయ్
హార్ట్‌తోటి ఆర్ట్ వుంటె ఎంజాయ్
ఎంజాయ్! ఎంజాయ్! ఎంజాయ్!

[నృత్యం ముగుస్తుంది. పిళ్ళై వెళ్ళిపోతాడు. ఆంగ్ల స్త్రీ, రూథర్ ఫర్డ్ బాస్టియన్లకు బ్రాందీ అందిస్తూవుంటుంది. యింతలో గొడ్డూఖాన్ వస్తాడు. ఆంగ్ల స్త్రీ వెళ్లిపోతుంది.]

రూ:- వాట్ గొడ్డూఖాన్! వాటీజ్ ది న్యూస్?

గొ:- సార్! సాబ్ హోగయా! మన్యం సఫాగయా! సార్! కానీ, కొండా హెల్కా సీతారామరాజుకీ కనుపించా లేదు సార్! వాడ్కి నిక్కి నిక్కీ హెక్కొ తిర్గుతూ వున్నాడ్!

బా:- సీటా రామరాజును పట్ట లేకపోయినావా గొడ్డూఖాన్! నీవు చాలా తెలివిగల్ల వాడివే!

రూ:- అంతటి తెలివిగల్ల వాడివైన నీవుకూడా సీటా రామ రాజును పట్టుకో లేకపోవుచున్నావా?

బా:- నీయొక్క తెలివిఅంతా యేమైనది?

గొ:- నాకీ బుర్రా యీ హెల్కాకి ముందు ఖాళీఅయింది సార్! యీ హడ్వేలోని యీ బడా హెల్కా కీ విషయం పిళ్ళే హయ్యంగార్కి సాబ్ మాలూంసార్! హయ్యం గాడి సంగతి మీకు మాలూంనై సాబ్!

రూ:- ఓహో! అది యే విధముగా జరుగును! పిళ్ళైకు తెలిసి యుండినచో మాకు చెప్పియుండెడివాడు.

బా:-పిళ్ళై చాలాచాలా అధికముగా రాజభక్తి కలిగినవాడు.

రూ:-మానద్ద అయిదువందల ఎకరములను బహుమానముగా సంపాదించుకొన్న పెద్ద రాజభక్తుడు.

బా:-అట్టి అమితమైనవిశ్వాసమును కలిగియుండిన వృత్తముండైన పిళ్ళె మాకు ద్రోహమును చేయును అని చెప్పిన మేము నమ్మువారలము కాము. సార్! ఐ డౌట్ యిట్!

రూ:-ఐ టూ! గోడ్డూఖాన్! నీవు సత్యమునే చెప్పుచుంటివా?

గో:-జీహా సాబ్! మై కభీ జూట్ నహీ బోల్తా! పిళ్ళెగార్కి బడాబడా నమ్మక్ హరాంసార్! వాడ్కి పిళ్ళెగాడ్కి బహూత్ మైం సీతారామురాజుకీ సైన్యంతో బాత్ చేస్తూ వుంటే మేము చూచినాముసార్! వాడ్కి హీండ్కి, వాడ్కి తల హీండ్కి పట్టుకొని, హీండ్కి తల వాడ్కి పట్టుకొని చెవ్వూ చెవ్వూ కల్పి, కల్పి, కల్పి, కల్పి, మాట్లాడ్తూ వుంటుందిసార్!

బా:- వాట్ గోడ్డూఖాన్! నీవు చెప్పుచూ వున్నది అంతయునూ సత్యమైన సమాచారమేనా?

గో:- సచ్చీ బాత్ సాబ్! అల్లాకి ముందునిల్చొని మేము చెప్తాముసార్! ఈ నాలిక్కి తీసి, ముక్కాల్ ముక్కాల్ కోసి అబద్దము చెప్పమంటే ఆ ముక్కాకికూడా అబద్దము చెప్పదుసాబ్! నమ్మించి, నమ్మకహరాంకా కామ్ కర్తా నై! మై ముసల్మాన్ కా బేటా! మేరానామ్ గోడ్డూఖాన్ సాబ్! గోడ్డూఖాన్ జూట్ కాబాత్ కభీ నహీం బోల్తా! యహ్ సచ్చాబాత్ మహారాజ్!

రూ:- గోడ్డూఖాన్! నీవు వెళ్ళిపో! జాగ్రత్తగా అన్ని విషయములనూ కనిపెట్టుచుండుము.

బా:- ఎప్పటికాప్పుడు జరుగు చూన్నటువంటి విషయములను జాగ్రత్తగా మాకు చేప్పుచుండుము.

గో:- అచ్ఛా సాబ్! సలాం! [వెళ్ళిపోతాడు.]

రూ:-వాట్ బాష్టియన్! మనసర్వెంట్స్‌లోకూడా యీలాంటి టైయిటర్స్ వున్నారా? పిల్లి చాలా మంచివాడు అని, అనుకొనియుంటిమి! ఇది మరియొకవండర్‌గా యున్నది. పిళ్ళై మనలను నమ్మించి, మోసముచేసియుండునా?

బా: నేను సరిగా యీన్యూస్‌ను నామ్మలేకుండా యున్నాను. గొడ్డూఖాన్ చేప్పిన మాటలకు సరిఅయిన రుజువు నాకు కానిపించటంలేదు.

రూ: బాష్టియన్! నీవు చేప్పునదియే నిజమని టాలచిన చో, చాలా చాలా నామ్మక పాత్రుడైన గొడ్డూఖాన్ ఏందు లకు అబద్దమును చేప్పవలెను?

బా: అదే మిష్టరీగా వున్నదిసార్!

రూ: వాట్! యీ మన్యమే మిష్టరీగా వున్నది. ఈ యిండి యాయే ఒక పేద్ద మిష్టరీ! మన్యం అంటయూ స్మేష్ అయినది అని చెప్పినాడు. వేనువేంటనే మన్యంలో మరల పేద్ద ఫైట్ కోసం మా సీటారామరాజు రెడీ ఔతూనే వున్నాడు అని మిరపకాయటపాలు వట్టూనేవున్నవి. ఇది అంటా వండర్! అల్లూరి సీటారామరాజు యీప్పుడు యీక్కడ దాడిచేసినాడు, అదే సామయములో వేరొక పోలీస్ స్టేషన్‌ను కూల్చివేసినాడు. అదే సెకండ్‌లో ఒక

పెద్ద అడవిలో లైన్సుతో, బేర్సుతో, టైగర్సుతో ఆటలు ఆడుచూవున్నాడు. ఆ దేశకాలములో యీభారతదేశానికి పెద్ద దేవుడైన శ్రీరామచంద్రునిలాగా దార్శనమిస్తాడు. ఇది అంతా వండర్! ఒక్క సీటారామరాజే యీంత పెద్ద భయమును కొలుపుచూవున్నాడు. మన సైన్యము, మన రైఫిల్సు, మన యింటెలిజన్సు, ఎవ్విరిథింగ్ యీజ్ నథింగ్ బిఫోర్ దిస్ యంగ్ యిండియన్! కరేజియస్ మిష్టీరియస్ యిండియన్! పేట్రియాటిక్ యిండియన్! ఐ మష్టుకిల్ దిస్ లైన్ ఆఫ్ ఆంధ్ర, నో, దిస్ లైక్ ఆఫ్ యిండియా, విచ్ యీజ్ ది ప్రైడ్ ఆఫ్ దిస్ ఇండియా!

బా:- వెరిగుడ్ సార్! యీంత పెద్దసింహామును చాంపుటకు మీకు చాలా ధైర్యమున్నది. మీకు అదృష్టముండి, మీరు చాంపబడక, మీరు చాంపినచో మన ప్రభుత్వము తమరిని ఘూనముగా బహుమానించును. టమకు ధైర్య ముటోబాటు మాంచియింటెలిజెన్సుకూడా వూన్నదిసార్!

రూ:- జాష్టియన్! ఏది ఎటుల వ్వూండినను యీయిండియన్సు సామాన్యులు కారు. భారటీయులనగా ధైర్యవంటులు. యీ యిండియన్సు అనగా అద్భుతమైన విజ్ఞానము కలిగి యున్నవారు. అందువలననే యీ అల్లూరు సీటారామ రాజుని మన టెలివితేటలతో చంపవలెను. వారు ఇప్పుడు ఏమిచేయుచున్నాతో టెలియడములేదు. అల్లూరి సీటా రామరాజు చాలా పాట్టుదలగల మనిషి! ఇంగ్లాండులో కూడా యీంతటి పాట్టుదలగల మానిషిని నేనుచూడలేదు.

వారిపేరు చెప్పినచోనే గుండెలలో ఎందులకో, కొద్ది కొద్దిగా భయము కలుగును.

బా:- యస్ సార్! మనం రెడీగా వుండాలిసార్! మనం స్పెషల్ ఆర్మీనికూడా రెడీచేయాలి సార్! నాకేదో భయము భయముగా యున్నదిసార్!

రూ: [గోడకుతగిలించియున్న ఆంధ్రప్రాంతదేశపటమును చూపెట్టుచూ:] బాప్టియర్! సీ దిస్ గాముకొండ! ఈ గాముకొండాకు బ్యాక్ సైడ్‌లో ఒక పేద్ద లోయావున్నాది. ఆ లోయా నిండుగా పేద్ద పేద్ద వృక్షములున్నవి.

బా:- యస్ సార్!

రూ:- ఆప్రదేశమంటయూ పేద్దపేద్ద లైన్స్, టైగర్స్‌వున్నవి ఆ విధమైన థిక్ ఫారెస్ట్‌లో అల్లూరి సీటారామరాజు మి[...] లిన తన సైన్యముతో వుండునుయని నాకు బిగ్ డౌట్ [దేశపటమును చూపెట్టుచూ] ఈచ్చుటచూడుము. ఈరామాస్[...] మార్గముల గుండా మన సైన్యమును గాముకొండక[...] పాంపండి.

బా:- రాజశాక్తిగల, పేద్ద పేద్ద బిరుదూలుగల జమీందార్ల అల్లూరి సీటారామరాజుయొక్క పిటూరీని అణగద్రొక్కు టకు మనకు బంపిన ఏనుగులుకూడనూ యున్నవి.

రూ:- ఈ ఏనుగులచేటనే గాముకోండమీాద యున్న పే[...] పేద్ద బాండలను వేట్టించి అల్లూరి సీటారామరా[...] సైన్యముమీాద పడవేయించండి. స్మేష్!

బా:- గుడ్ ఐడియా సార్! ఈ ఫైట్‌తో మన్యంలోని లాస్ట్ క్రీచర్ గూడా స్మేష్!

రూ:-యస్ బాప్టియన్! యిప్పుడు యీ ప్లేన్‌తో ఫైగర్, అల్లూరి సీటారామరాజూని సూలభముగనే పాట్టవాచ్చు!

బా:-యస్ సార్! యింకాన అల్లూరి సీటారామరాజు వుపాయ ములు పానికిరావు.

రూ:- మన బ్రిటిష్ వాండ్ల యింటెలిజెన్స్‌ముందు, యీస్ట్రాల్, యిండియన్స్ యింటెలిజెన్స్ యీజ్ నథింగ్; యేమియూ పానికిరాదు. యీండియన్స్‌కు అయిక మాట్యము లేదు. వీరికి అయికమట్యమే యూండినచో యీ అల్లూరి సీటారామరాజు ఫైట్‌కే వీరందరూ సాయము చేసినచో

బా:- మనం నెక్స్ట్‌ఫైట్ సెకండులో స్మేష్! మొన్న కాకినాడలో కాంగ్రేసు మహాసభలు జారిగినవి. అచ్చటికి అల్లూరి సీటారామరాజు తెల్లటి గూఱ్ఱముమీద వచ్చూనుయని, యీ యీండియన్సే మాకువర్తమానములు యిచ్చినారు. అందువలన సీటారామరాజు తను అనుకొనినంత కాలము అచ్చట వుపన్యాసము యివ్వలేకపోయినాడు.

రూ:- ఒక్క క్షణములోనే బాంబ్స్ పడినట్లు కాంగ్రేసు నాయకులకు, మా బ్రిటిష్ వారితో యేవిధముగా ఫైట్ చేయవలెనో చెప్పినాడు అట. యీంటలో మా సైన్యము అల్లూరి సీటారాను రాజును పాట్టుకొనుటకు రెడీఅయినదిఅట.

బా:- కన్నులు మూసి కన్నులు తెరిచేలోపలనే అల్లూరి సీటారామరాజు అదృశ్యమైనాడు.

రూ:- అల్లూరి సీటారామరాజు మిాన్స్ ది గాడ్స్ గిఫ్ట్ టు యిండియా!

బా:- యస్ సార్! భారట దేశమునకు ఆ సర్వేశ్వరుడు బహు మానముగా బంపిన గొప్ప బహుమటి యేదియన, గుండె ధైర్యమును అధికముగా కలిగి, సంపూర్ణ దేశభక్తి కలిగిన అల్లూరి సీటారామరాజు! ఆ పేరులోనే ఏదో ఎట్రాక్షన్ వున్నది.

రూ.- ఎట్రాక్షనే కాదు! బిగ్ ఫీచర్

[పిళ్ళై వస్తాడు. సెల్యూట్ చేస్తాడు.]

బా:- వాట్ పిళ్లై! ఏమి సాంగటులు!

పి:- పుదూ విషయములుదా ఒన్నూ మిల్లే సార్.

రూ:- అల్లూరి సీటారామరాజుయొక్క జాడ యేమియును తెలియు లేదా?

పి:- ఎంగె పాతియా కానమేసార్! తాప్పించుకొనిదా పోయ్ వుండును.

రూ:- అసత్యమును చెప్పకూడదు. అసత్య వాక్యములని బల్కినచో మిా యిండియన్స్ దేముడైన శ్రీరామచంద్రుడు నిన్ను క్షమించదు. అసత్యమును చెప్పాటయన్న నీ పాపమును చేసుకొని మిా యమలోకమునకు మార్గము వెదకుకొనుటే! అందువలన నిజమునే బలుకుము.

బా:-నిర్భయముగానే చేప్పుము! ఆయిదువందల ఏకరములను సంపాదించుకొన్న రాజభక్తిగల పౌరునిగా చేప్పుము.

పి:- సార్!

రూ:-నిన్నూ మేము యేమీఅనము! అల్లూరి సీటారామరాజు మీకు యేక్కడ కన్పించినాహో అదిమాకు చేప్పుము.

పి:- యనకు తెరియదుసార్!

రూ:- నీకు తెలియదుయని చెప్పినచో, నీకు తెలియకుండా పోదు.

పి:- నేనుదా చూడలేదుసార్! నేనుదా అబద్ధం చెప్పను సార్! నేనుదా మీ ఒబీడియంట్ సర్వెంటును సార్!

బా:- నీవు అల్లూరి సీటారామరాజుని చూచినట్లు మాకు నామ్మకమైన వార్తలు వచ్చియున్నవి.

రూ:- నీవు చేప్పకపోయినచో, నిన్ను ట్రైటర్ గా లేక్క పెట్తాము.

బా:- అర్థము ఆయినదా?

రూ: క్విక్! పిళ్ళై! కమాన్! జవాబును త్వరగా చేప్పుము.

పి:- నాకుదా అల్లూరి సీతారామరాజుదా కన్పించలేదుసార్! నేనుదా అబద్ధము చెప్పనుసార్!

[రూథర్ హంటర్ తో కొట్టును. పిళ్ళై బాధతో అరుచును.]

రూ:- పిళ్లే! మీ యిండియాన్సును ఏద్దులను కోట్టినట్లు కోట్టుతూవుంటేనే పానిచేస్తూవుంటారు. [హంటర్ తో మళ్ళీ కొడ్తాడు.]

పి:- [బాధతో మూల్గుతూ] అయ్యో! నాకుదా తెలియదు సార్! నన్నుదా మీరు యీ విధముగా కొట్టవచ్చునా సార్! రొంబా అన్యాయం! కడవలే! నేనుదా మన్యం సీక్రెట్‌ను మీకుదా మొదాలు తెలియచేస్తిని మన ఆర్మీ నష్టం కలుగకుండా చేస్తిని. మన్యంలోని చిన్నచిన్న బిడ్డలను చంపితిని! సిల్లుత్రాగే బావుల్లాదా పాయిజన్ కల్పితిని. అందుకుదా మీరు నన్ను హంటర్‌తో కొట్తురా?

బా:- గొప్పగొప్ప పనులుచేసి నీయిండియన్స్‌ను నీవు చాంపినందులకు రూథర్‌గారు నీయొక్క రాజభక్తికి మెచ్చి ఒక్క ఆయిదువందల ఎకరముల మాగాణి భూములను ప్రెజెంట్ చేసినారు.

రూ - యిప్పుడు ట్రైటర్‌గా ప్రవర్తిస్తున్నందులకు [హంటర్‌తో కొట్టాడు] కమాన్! ఒక్క విషయము గూడా దాచకూడదు!

పి:- యన్నకు ఒన్నూ తెరియాదుసార్! [రూథర్ మళ్ళీ హంటర్‌తో కొట్టాడు.] మీరుదా ఎన్ని కొట్టినప్పటికీ నాకు తెలియని విషయాలు ఎట్లదా తెలుస్తుందిసార్! మీ భూములు, ఒన్నుమే యన్నకు వేండాసార్! నన్నుదా వదలిపెట్టండిసార్!

రూ - నీవు యిక్కడ జరుగుచూవున్న విషయములన్నిటినీ అల్లూరి సీటారామరాజుతో చెప్పినట్లు మాకు చాలా నమ్మకమైన వార్తలు వచ్చినవి. ఈ యొక్క దినముక్కూడా

నీవు బ్రైగర్ అల్లూరి సీతారామరాజుకు సహాయం చేసినట్లు మాకు బాగుగా తెలియును. ఈ సమాచారమును ఒక్క క్షణముక్రితమే నమ్మకమైన గోర్డూఖాన్ మాకు తెలియ చేసినాడు. నీవు మమ్ములను నమ్మించి మోసము చేసి నందులకు నీకు ప్రెజెంట్... [బాప్టియన్ వైపు చూచును. బాప్టియన్ ప్రక్కనేవున్న చిన్నకత్తిని పిళ్ళె గుండెలపై విసురును. గుండెల్లోనుంచి రక్తం ఎగజిమ్ముతుంది. పిళ్ళె బాధతో అరుస్తూ క్రిందబడ్తాడు. రూథర్ బ్రాందీని త్రాగుతూ పిళ్ళెను కాలితో తంతాడు. పెద్దగా నవ్వుతాడు.]

రూ:- పిళ్ళే! [పెద్దగా నవ్వుచూ] చాలా దినములనుండి నీవు చేసిన మోసమునకు యీనాడు నీకు మంచి బహుమానము దొరికినది.

పి:-పాపీ! నేనుదా మీకుఎంతో సిన్సియర్‌గా సర్వీస్ చేసినాను. కడవలే! యన్‌కు యిందమాదిరి బహుమానమా? అవును! దేశమునకు, అన్యాయం చేస్తిని. నాకు, నా కొళందు సాపాటుకు ఆశపడి నా దేశంను, కోట్లమంది సోదరులకు ద్రోహం చేస్తిని! నాకుదా యిందమాదిరి మరణం కట్టాయం! కడవలే! యిందమాదిరి మరణం యన్‌కు కట్టాయం! గోర్డూఖాన్ నాకు ద్రోహం చేసినాడు! ఈ దేశం పోతే వాడికిదా యేమిపోయినది. వాడికి యీ దేశం మీద భక్తిదా ఎట్లుండును! మీరుదా వచ్చినట్లే వాడుగూడా వచ్చినాడు! ఒకటిదా పిల్లి! ఒకటిదా నాయి.

రూథర్! మీకుదా రొంబా చెడ్డాకాలం! మా అల్లూరి సీతారామరాజుదా నిన్ను, యీ టెంట్‌లోనే

చంపుతాడు. నేనుదా చచ్చిపోతాను! నాబోటి నాయికి యిందమాదిరి శిక్షదా కావలెను! నిన్నుదా సీతారామ రాజు యీ దినం చంపకుండా వదలడు! అబ్బ! రొంబా బాధ! కడవలే! ఎన్నా సేయం! భారత్ మాతా! నన్నుదా క్షమించమ్మా!

[పిళ్ళై బాధతో మరీ కూలిపోతాడు.]

హ:- బాస్టియన్! కమాన్! వెంటనే మనము యీ టెంట్ను వదలి వేళ్ళిపోవాలి! అల్లూరి సీటారామరాజు యిప్పుడే యుద్ధానికి స్వయముగానే రావచ్చును. ఈప్పుడు పుద్రేకముతో వాచ్చినచో నీ ప్రాణమూ, నా ప్రాణమూకూడా కలిసి ఎగిరిపోవును. యిప్పుడే మనము పోయి పేద్ద ఆర్మీతో వచ్చి మనం ఫైట్ చేయాలి. క్విక్! బాస్టియన్! రనప్! బాస్టియన్! మన డ్యాన్సబ్యూటీని వెంటనే వెళ్ళి పొమ్మను.

బా:- ఫ్లారెన్స్! రనప్! ది టైగర్ ఆఫ్ మన్యం యీజ్ కమింగ్!

[బాస్టియన్, రూథర్ బిత్తరతో వెళ్ళిపోతారు. మరియొకవైపు నుంచి ఆంగ్లవనిత తప్పించుకొని పరుగెత్తబోతుంది. ఈలోపల సీతారామరాజు వస్తాడు. సీతారామరాజుని చూచి దిగ్భ్రమజెంది ఆంగ్లవనిత వున్నచోటనే నిల్చిపోతుంది. క్రిందపడివున్న పిళ్ళైను చూస్తాడు. పిళ్ళై మరణబాధతో వుంటాడు. ఆంగ్లవనిత భయపడుతూ తప్పించుకొనిపోను ప్రయత్నంచేస్తూ అక్కడవున్న వస్తువులను క్రిందవేయడం, పైన పడవేసుకోవటం జరుగుతుంది. సీతారామరాజుదృష్టి అప్పుడు అటువైపుకు పోతుంది. అలా పైకి మెల్లగా లేస్తాడు.]

సీతా:- ఎవరు నీవు?

ఆం-స్త్రీ:- నాయొక్క పేరు ఫ్లారెన్స్! నేను ఒక యూరో పియన్ లేడీని.

సీతా:- నీ పని యేమిటి?

ఆం-స్త్రీ:- డ్యాన్స్! బ్యూటిఫుల్ డ్యాన్స్! అందమైన నా నృత్యము ఒక్కసారి చేయమంటారా? మీ భారతీయులకు నృత్యమన చాలా యిష్టముగదా! యు లైక్ ఆర్ట్! ఆర్ట్ యీజ్ ది లైఫ్ ఆఫ్ యిండియా!

సీతా:- ఇది మాకు నృత్యమునకు సమయముగాదు. ఇపుడు తెల్లజాతి కంకాళనృత్యము తెనుగు గడ్డమీద జరుగ వలెను.

ఆం. స్త్రీ:- ఓహ్! మీ మాటలే నా గూండెలను పీకి ఆమిట భయమును కొలుపుచున్నవి.

సీతా:- నీవు అదృష్టవంతురాలివి.

ఆం-స్త్రీ:- ఓహ్! అది ఎట్లా!

సీతా:- నీవు ఆడదానివికాబట్టే! కాకపోయినచో నీ చేతనే నృత్యము చేయించివుందును...నృ...త్య...ము!

ఆం-స్త్రీ:-మీ దాయ నాపైయున్నచో నేను చాలాసంతో షముగా మీ ఎదుట నృత్యముచేయుదును. నృత్యమును చేయుటకు కళాహృదయము కాలిగిన మీరు నాకు ఒక్క అవకాశమిచ్చినచో మీ కాన్కులపొందుగా

నృత్యమును చేయుదును. మీభారటీయులకు నృాట్యము యన ప్రాణముగదూ!

సీతా:- తమరు దయచేయండి. నృత్యమువొద్దు. ఇపుడు కళా హృదయముకాదు నాది; శ్వేతజాతి భీకర కరాళ స్మశాన నృత్యమును చూడగోరు ప్రతీకార హృదయము.

ఆం-స్త్రీ:- కోపాములోకూడా మీ యిండియన్స్ చాలా నైస్‌గా మాటలాడుదూరు. మీరు అంటే చాలా పేద్ద సింహాముయనీ, పేద్ద పూలియాని చాలా మాంది చేప్పు కొనుచూ యూండగా నేను నా చెవ్వులద్వారా వింటిని. మా బ్రిటీష్ జాటికి మీ పేరు పింటేనే టెర్రర్! ఓ...హ్! [నృత్యము నభినయిస్తు] నృాట్యమును చేయమందురా?

సీతా:- చాలించు నీ ప్రసంగం. నీవు వెళ్ళిపో! నా సోదరివిగా మర్యాదగా వెళ్ళిపో!

ఆం-స్త్రీ:- సా...ర్! అల్లూరి సీటా రామ రాజుగారూ! మీ భారటీయులహృదయము చాలా పేద్దది. విరోధులనుకూడా క్షామించు హృదయము యీ అనంట ప్రపంచములో ఒక్క భారటీయులకు మాత్రమే యూన్నది. వెరీ మెనీ థ్యాంక్స్! థ్యాంక్స్!

[ఆంగ్ల స్త్రీ వెళ్ళిపోతుంది. సీతారామరాజు క్రిందపడియున్న పిళ్ళె దగ్గరకు వస్తాడు.]

సీతా:- ఎవరయ్యా నీవు

పి:- నేనుదా అరవవాడిని.

సీతా:- అరవసోదరుడివా! చాలా సంతోషం. ఏమిటీ కత్తి గాటు! ఏమిటీ రక్తప్రవాహము! ఏమిటీ మరణబాధ! అయ్యో! చెప్పుము సోదరా!

పి:- సీతారామరాజుగారూ! నేనుదా ఒక ద్రోహిని. నా మరణానికిదా మీరు కష్టమువొద్దు. నేనుదా రొంబా ద్రోహం దేశానికిదా చేస్తిని. పణంకోసందా, దేశానికి పెరియా వ్యతిరేకముగా నీతిలేని యీ తెల్లజాతి నాయిలో చేతులుదా కల్పితిని! తుదకు యిందాపూదిరి మరణం యనకు సంప్రాప్తం! నన్నుదా క్షమించు-రాజూ! నన్నుదా క్షమించు.

సీతా:- ఆఁ! సోదరా!

పి:- 'రాజూ!' మీరుదా వెళ్ళిపొండి! రూథర్ సైన్యంతో మిమ్మల్నుదా అరెస్టుచేయించను సైన్యంకోసం వెళ్ళి యున్నాడు! 'రాజూ!' శీఘ్రమేపొండి! మీరుదా దేశానికి కావాలి!

సీతా.- సోదరా! ఎంతబలంగా, గాయాలు తగిలినవినాయనా!

[రూథర్ ప్రవేశిస్తాడు. చేతిలో రివాల్వరు. వెనకప్రక్కగా మిల్ట్రీసైన్యం వుంటుంది. వారు అక్కడ వున్నట్లు బూట్లశబ్దంవల్ల తెలుస్తుంది. రూథర్ వెంబడి మారణాయుధముల ధరించిన యిద్దరు బ్రిటిష్ సైనికులుకూడా వుంటారు. సీతారామరాజు వాండ్లను చూచి కూడా పిళ్ళైవద్దనుంచి పైకిలేవడు. పిళ్ళై, 'అమ్మా' అని అరుస్తూ చనిపోతాడు.]

సీతా:- హృదయము లేని బ్రిటిష్‌జాతి నమ్మినవాండ్లనుకూడా ఆలోచన లేకుండా ఆహుతి గొంటుంది.

[రూథర్ సీతారామరాజును చూస్తూ]

రూ:- నీవ్వా ఎవరు?

సీతా:- నా దేశమును దోపిడీచేసే దారిదోపిడీగాండ్లను హాత మార్చవచ్చిన భారతీయుడను.

రూ:- హేండ్సప్!

సీతా:- షటప్!

[బాస్టియన్ వస్తాడు. సీతారామరాజుని చూచి వణకిపోతాడు. ఆ వణుకుతో రూథర్ మీద బడ్తాడు. కాళ్ళు తడబడ్తుంటవి. యేమోమో చెప్పబోతాడు. పెదాలు ఒణుకుచున్నవి. మాటలు రావడంలేదు.]

రూ:- [బాస్టియన్‌తో] వాట్! వై ట్రెంబిల్! ఎందుకు నీ కింట భయము! ఇంట నిర్లక్ష్యముగా మాటలాడే యీ మనిషి ఎవరు? బాస్టియన్! హు యీజ్ దిస్ కరేజియస్ యిండియన్?

బా:- పీరా సా...ర్! పీరా సా...ర్!

రూ:- [బిగ్గరగా] వై! ఫియర్! బాస్టియన్!

సీతా:- ఫియర్! ఐయాం ది అల్లూరి సీతారామరాజు; నైట్‌మేర్ ఆఫ్ యువర్ బ్రిటిష్ ఎంపైర్.

రూ:-హా...! [అంతవరకూ నోటిలోయున్న దొరచుట్ట దానంతట అదే క్రిందబడ్తుంది.]

సీతా:- భయమెందుకు రూథర్! ఎందుకు భయం! ఏది నీ ధైర్యం? వేనకువేలమంది అమాయక మానవుల పొట్టన బెట్టకొన్న పశువుకు నీకెందుకు భయం!

రూ:- హౌవ్!

సీతా:- ప్రశాంతంగా జీవనం చేసుకొంటున్న మన్యపుప్రజల గుండెల్లో మంటలు రేపిన మహాపాపీ! నంగనాచివలె నటిస్తున్నావటరా రాక్షసుడా?

రూ:- వా...ట్?

బా:- సా...ర్!

సీతా:-రూథర్ అండ్ బాస్టియన్! దుష్టద్వయానికి సమిష్టిగా హెచ్చరిక! బ్లడ్ ఫార్ బ్లడ్! పచ్చటి సంసారాల్లో శారుచిచ్చుబెట్టిన పరమ నికృష్టపు మానవాధములారా! రక్తానికి రక్తం త్రాగాలిరా! మీ శవాలను, లండన్ నగర కుక్కగొడుగు సింహాసనంమీదకి ఎగురవేయాలి కదరా! మీ దేశంలోనుంచి క్షణక్షణానికీ మా దేశం మీదకు దండెత్తివచ్చే దోపిడీముఠాలకు మీ శవాలు ఒక హెచ్చరిక.

ూ:- వాట్! వాట్! ఓ శ్రీ శ్రీ సీటా-రామరాజుగారూ!

[రూథర్‌ను మాట్లాడవద్దని బాస్టియన్ సైగ చేస్తాడు.]

సీతా:- నథింగ్ రూథర్! నథింగ్ న్యూ! అన్యాయంగా, అక్రమంగా దేశంకాని దేశంమీద కాలుపెట్టే దౌర్జన్యవాదుల రక్తాన్ని ఆ దేశపు సరిహద్దులదాకా ప్రవహింపచేయాలి, అని అంటున్నాను. ఇందులో క్రొత్తేమీ లేదు.

బాస్టి:- సా...ర్! సా...ర్! సీ ..టా...!

రూ:- పెద్దపెద్దగా కేకలు పెట్టినమాత్రమున అది దేశభక్తి యగునా?

సీతా:- కాదు! కన్న దేశంలో కూడు లేక, బొచ్చె నెత్తుకొని పరాయి దేశాల్లో భిక్ష మెత్తుకొంటూ నాగుబాములై కాటేసే నీలాంటి విషపురుగులను నలిపి పారవేయడం దేశ భక్తి యవుతుంది.

బా:- సీటారామరాజుగారూ! చాలా చాలా భయముగా యున్నది! నెమ్మదిగా మాటలాడండి!

సీతా:- ఛీ! బ్రతుకంటే విలువలేని పంది!

రూ:- ఈవిధముగా మాటలాడుట మర్యాద కాదు!

సీతా.- ఏది మర్యాద? ఏది సభ్యత? ఏది న్యాయం? స్త్రీలను నడివీధుల్లో మానభంగం చేయడం మర్యాదా? గర్భిణీ స్త్రీలను కత్తులతో పొడవటంమర్యాదా? నోరులేని చంటి బిడ్డలను చిత్రహింసలు చేయటంమర్యాదా? ఏదిమర్యాద? ఏదిమానవత్వం? ఏది నీ సర్వప్రాణిసౌభ్రాత్వత్వ సిద్ధాంతం పూథక్!

రూ:- అనవసరముగా మాట్లాడవద్దు! మాట్లాడటం మీ ఇండియన్స్‌కు బాగుగా తెల్సునని మాకు చా... బాగుగా తెలుసు!

సీతా:- ఛీ!

రూ:- డెన్! బి రెడీ! [పిస్టల్ తీసి కాల్చబోతాడు.]

సీతా:- నన్ను కాల్చినా, కోటానకోట్ల నా సోదరుల హృదయాల్లో ప్రజ్వలిస్తున్న అకుంఠిత దేశభక్తిని మాత్రం కాల్చ

లేవురా దుర్మార్గుడా! ఇది భారత దేశం. ఈ దేశంలో అణగియున్న దేశభక్తి ఒక్కమారు ప్రవ్యాప్తిగాపొంగిందా, నిన్ను, నీ దేశాన్ని. నీ సకలసామ్రాజ్య సింహాసనాధిపత్యాన్ని ఒక్కమారుగా ముంచివేస్తుంది.

రూ:- సీటారామ రాజుగారూ! యిప్పుడు మీయొక్క గొప్ప గొప్ప దేశభక్తిని బాగుగా ప్రదర్శించండి. మేము మా యొక్క దేశభక్తిని యిప్పుడే యిక్కడే ప్రదర్శించుటాము.

[రైఫిల్‌తో రూథర్ సీతారామరాజును కాల్చబోతాడు. ఎచ్చట నుంచియో పరుగెత్తుకొని వచ్చుచూ ఆంగ్లనర్తకి సీతారామరాజుకి అడ్డముగా నిల్చొంటుంది. రూథర్ కాల్చిన కాల్పు ఆమెగుండెలకు తగిలి నెత్తురుకార్తుంది. సీతారామరాజు ఆమెదగ్గరకు వస్తాడు.]

ఆం-స్త్రీ:- రూధర్ అండ్ బాస్టియన్! యు హేవ్ లాస్ట్ మేన్ హుడ్! యు ఆర్ షూటింగ్ ఎ మేన్ హు యీజ్ ఎ మేన్ ఆఫ్ క్యారెక్టర్ అండ్ బోల్డ్‌నెస్!

ూ:- యూ షటప్ ఫ్లారెన్స్ ఫస్టఫాల్.

-స్త్రీ:- ఐ యాం నాట్ ఫ్లారెన్స్ ఫ్రం టుడే. దయార్ద్రహృదయుడైన యీ భారతీయుని చావుకు ఏంటటి కఠినులకైననూ చేతులురావు. ఏ దేశపు మానిషియైననూ అటను సన్మార్గుడైనచో, ఆటనిని గౌరవించవలెనేగాని, హింసించకూడదు. అది మానవాత్వమునకే పెద్ద కళంకము.

బా:- సార్! షూట్ దిస్ బ్లడీ గర్ల్!

సీతా:- హ్హా! ఆమెను చంపినా, ఆమెలోని మానవత్వమును కాల్పలేవు.

ఆం-స్త్రీ:- బ్రదర్! ఈంక నేను బ్రతుకలేను. కానీ పాశ్చాత్య స్త్రీనిగా కాక నేను భారతీయ స్త్రీగా చనిపోవుదును. నన్ను కలుపుకొనండి—నేను నీ సహోదరిని; సిస్టర్!

సీతా:- నా జాతి అనంతం! నిన్ను లీనం చేసుకొనను నా జాతికి హృదయం వున్నది. రా చెల్లీ! నీ పేరు ఫ్లారెన్స్ కాదు గదూ! నిన్ను పార్వతీ అనిపిలుస్తానులే! సిస్టర్ నివేదిత మీ సోదరి! భారతీయ ఆధ్యాత్మికశక్తిని మననం చేసుకొన్న మీ పితామహుడు బ్రౌన్! వారి జాతికి చెందిన దానవి నీవు పార్వతీ! యుద్ధభూమిలో నాకు చెల్లెలు దొరికినది. ఆమె పార్వతి. ఆమె భారతీయుల సహోదరి! అమ్మా! పార్వతీ! ఏదీ ఒక్కమారు నన్ను 'అన్నా' అని పిలువు!

పార్వతి:- అ...న్నా!

రూ:- ఫ్లారెన్స్! యు షుడ్ నాట్ లివ్.

[మరల కాల్చుతాడు. సీతారామరాజు అడ్డురాబోతాడు. ఆ లోపల నే ఆ దెబ్బ ఆమెకు తగిలి ఆమె ప్రాణములు కోల్పోతుంది.]

సీతా:- పార్వతీ! అమ్మాపార్వతీ!

రూ:- బి రెడీ సీటారామరాజుగారూ.

సీతా:- కాల్చురా కాల్చు! నీతిలేని కుక్కా! ఆడదానిని హత్య చేసిన దుర్మార్గుడా! కాల్చు! ఎందరి శవముల పొట్ట...

నింపుకొంటేనో, నీ తెల్లజాతి రాక్షసికి ఆకలి తీరిపోదు! కాల్చురా కాల్చు! నన్ను నీవు కాల్చలేవురా!

రూ.- దెన్ బి రెడీ [రూథర్ సీతారామరాజుని కాలుస్తాడు. సీతారామరాజు రంగస్థలంనుంచి అదృశ్యుడౌతాడు. రూథర్ అయిదారు పర్యాయములు కాలుస్తాడు. విజయసూచకమైన ఆంగ్ల సంగీతము లోపలనుంచి విన్పించుచుండును.] బాప్టియన్! ఈ అల్లూరి సీటారామరాజు నా రైఫిల్ షాట్సుకు స్మేష్ అయినాడు. టుదకు బూడిదకూడా కాన్పించకుండా స్మేష్ అయినాడు.

బా:- కాదుసార్! అల్లూరి సీటారామరాజు పెద్ద మాంత్రములు తెలిసినవాడుసార్! మీకు కన్పించకుండా టాప్పించుకొని పోయివుంటాడుసార్!

రూ:- నాన్సెన్స్! ఇండియన్ హీరో అల్లూరి సీటారామరాజుని యీ రూథర్ చంపినాడు. ఇది ఫేక్ట్! ఇది సత్యము [సంతోషముతో చేతనున్న పిస్టల్ను ఆకాశంలోనికి కాలుస్తాడు.]

లోపల-సీతా: నేను చావలేదు! నేనంటే ఒక వ్యక్తిని కాదు. నేను ఒక వుద్రేకాలకుప్పను. నేనొక స్వాతంత్ర్య పిపాస మహా సముద్రమును. నేనొక జాతిభక్తి ప్రేరిత జ్వాలనాజ్వాలిత అగ్నిశిఖను! నేను చావను! నన్ను చంపలేరు!

బా:- యస్ సార్! డేంజర్ సార్! ఫియర్ సార్!

రూ:- హంబక్! సీటారామరాజుని నేను చంపినాను. ఇది వరల్డ్ ఫేక్ట్! ఇది నేకెడ్ ఫేక్ట్!

సీతా:- లేదు నీవు యీ గడ్డమీదినుంచి తొలిగిందాకా నేను చావను! నీకంటే ఒక అధికారదుర్మదాంధ మబ్బుపొగవు! నీవు పోసదే నేను పోను!

రూ:- నో! నీవు చానిపోయినావు!

సీతా:- లేదు నన్నెవ్వరూ చంపలేరు! నేనంటే భారతజాతి! నేనంటే వీరులత్యాగ మహాయజ్ఞం! ఇది సర్వకాల ప్రామాణిక సత్యం! సత్యానికి చావులేదు!

[ రూథర్ బాష్పియన్లు గుడ్లప్పగిస్తూ చూస్తుంటారు. సీతారామరాజు చెప్పేమాటలు విన్పించుచుండును. తెరవాల్తుంది. ]



విక్టరి ప్రెస్, నెల్లూరు-2.